

విలాయత్ హుస్సేన్ ఖాన్ (మే 12)

# అఖిలభారత సంగీత కార్యక్రమము



డి. కె. పట్టమ్మాళ్ (మే 5)



విజయవాడ ఆంధ్ర జింఖానా గ్రౌండ్స్‌లో ప్రఖ్యాత టెన్నిస్ ఆటగాండ్రు ఆర్. కృష్ణన్, నరేష్ కుమార్, నీల్ ఫ్రేజర్



విజయవాడ అకాశవాణి టెన్నిస్ సమీక్షకులతో ఆర్. కృష్ణన్, నీల్ ఫ్రేజర్ మున్నగువారు





హెలెన్ ముర్రే చంద్రన్ దేవనేశన్
[చర్చ (ఆంగ్లం) మద్రాస్, మే 15]



ముడికొండాన్ వెంకటరామ అయ్యర్
(మద్రాస్, మే 10)



టి. కె. రంగాచారి
(మద్రాస్, మే 4)

వాణి
ప్రతినెలా 7, 22-వ తేదీలలో వెలువడును.
విడిప్రతి వెల 35 నయాపైసలు.
సంవత్సరం చందా రూ. 8-40 నయాపైసలు.
సంవత్సరమునకు తక్కువ చందా అంగీకరింపబడదు.
ఇతర వివరములకు :
ఎడిటర్, 'వాణి'
ఆలిండియా రేడియో, మద్రాస్-4.



ALL INDIA RADIO



సంపుటము XIII] వాణి 22—4—1962 [సంచిక 23

# సారస్వతానికి టాగూరు శాశ్వతంగా ప్రసాదించిన ఆస్తి

కాకా సాహెబ్ కలేల్కర్

టాగూరును ఎన్నడూ చూచి వుండని వాళ్ళకు, ఆయన శతవార్షిక జయంతిని, సమధికోత్సాహంతో, సంభృతానందంతో జరుపుకోవడం సులభమే. కాని ఆయనను చూచిన వాళ్ళకూ, దివ్యగాత్రముతో ఆయన పాడగా విన్నవాళ్ళకూ అత్యవసర దేశసమస్యలను కొన్నిటిని ఆయనతో చర్చించే అదృష్టం పట్టినవాళ్ళకూ అది వేరువిధంగా ఉంటుంది. ఆమహాకవి నిర్యాణాన్ని తలుచుకున్నప్పుడెల్లా నాకు విచారం కలుగుతుంది. ఎప్పుడో 1915లో శాంతినికేతన్‌లో నేను గడిపిన కొద్దిరోజుల మధురస్మృతులు నా మనస్సును అలుముకుంటున్నాయి.

## ఆద్యంతాలూ కవి

రవీంద్రనాథ్ టాగూరు ప్రధానంగా కవి-మహాకవి. ఆయన వ్యక్తిత్వంలోని ఇతర లక్షణాలన్నీ, అవి ఎంత ప్రతిభావంతములైనా, కవిగా ఆయన ఔన్నత్యానికి లోంగేవే. కవిగాకూడా ఆయనది ఒక ప్రత్యేకత. భావనా పటిమతోనూ ఊహా సౌందర్యంతోనూ మనల్ని ముగ్ధుల్ని చేయగల దిగంత విశ్రాంత కీర్తులైన కవులు చాలామంది వున్నారు, కాని వారి జీవితాలకూ వారికవిత్వానికీ ఏమీసంబంధం లేదు. కవిత్వమే జీవితంగా బ్రతకడానికి ప్రయత్నించిన కవులు చాలా కొద్దిమంది. నా జీవితకాలంలో అలాటి వారిని బహు కొద్దిమందిని మాత్రమే చూచాను. శ్రీ అరవిందఘోషుని రవీంద్రనాథునితోపాటు పేర్కొనవచ్చును. కాని శ్రీ అరవిందుడు మొదట తత్వవేత్తా, యోగీ, తర్వాత కవీ. రవీంద్రనాథుడు ఆద్యంతాలు ప్రముఖంగా కవి. ఆయన్ను ఉత్తమ దేశాభిమానిగా చేసింది ఆయన కవితాప్రతిభే. జీవిత సమన్వయ సామరస్య సాధకుడైన గొప్ప తత్వవేత్తగా ఆయన్ను భాసింపజేసింది ఆయన కవితా హృదయమే. ఆయన అద్భుత విద్యావిధానమూ ఆచరణా, ఆయన కవితాదర్శనంలో నుంచి పుట్టుకొచ్చి ఆయన్ను మహా విద్యావేత్తను చేశాయి. నిజమైన కవితా ప్రతిభ కలవాళ్ళ జీవితాన్ని నేరుగా సమగ్రంగా అర్థంచేసుకుంటారు. అందువల్లనే టాగూరు, ఉపనిషదృషుల సూక్తులనూ, బుద్ధుడు, జరథూష్ట్రా, మొదలైన ప్రవక్తల సూక్తులనూ, సరిగా వ్యాఖ్యానించగలిగాడు.

## సమమేవ సేవ్యాః

మన దేశీయుడొకడు, ఐరిష్ కవి యేట్స్‌తో మాట్లాడుతూ, "బ్రతకటానికి తిరస్కరించని మా ఏకైక ఋషి రవీంద్రనాథుడు" అంటూ, టాగూరు ప్రతిభను ఒక్కవాక్యంలో నిర్వచించాడు. రవీంద్రనాథుడు ప్రేమనుగురించీ జీవితాన్ని గురించీ పాడిన కవి. జీవితమూ దాని మననమూ ఊహలో అనుభవంలో అంత గాఢమై వుండగా, అడవిలో ముక్కుమూసుకుని కూర్చునే సన్యాసి జీవితాన్ని ఆయన ఎలాగడపగలడు? ఆయన 'వైరాగ్యవాదికాదు. 'వైరాగ్యసాధనే ముక్తిషే ఆమార్ నోయ్' అని, అందువల్లనే ఆయన రుండబ్రద్దలు కొట్టినట్లు చెప్పగలిగాడు.

## ఈ సంచికలో

ముఖచిత్రం: శ్యామశాస్త్రి
(వీరి జయంతిని పురస్కరించుకొని ఏర్పాటుచేసిన కార్యక్రమాలు మే 6,10 తేదీలలో వినవచ్చును.)

ధర్మార్థకామాః సమమేవ, సే
వ్యాః" అనే వ్యాససూక్తి అయన
జీవితాదర్శమైవుండి వుండాలి.
సీసమాజ జీవితాదర్శాలలో, సీ
( ' వంచిత వ్యాపారాలలో, సీ
..తర్ బహిః ప్రకృతి సౌందర్య
: సాస్వాదనలో, ఒకతూకం
ఒక సామరస్యం వుండాలి. "య
ఏకనేవీ భవయే జహన్యః" అన్న
ట్లుగా ఈ ఉత్తమ పురుషార్థాలలో
ఏదో ఒకదానిపైనే మనస్సు కేంద్రీ
కరించే వాడిది వట్టి దౌర్భాగ్య
జీవితం.

### ఆర్యజీవన దృక్పథం

ఈ ప్రపంచ మంతామాయ అని
మన పురాతన ఋషులూ యోగు
లూ చెప్పారు. వైరాగ్యం వల్లనే
పరమ శాంతిలభించగలదని వాళ్లు
ఆశించారు. కాని తరువాత తత్వ
వేత్తలూ జ్ఞానులూ ఈ నమ్మకాన్ని
కొంత మార్చారు. ప్రవృత్తి
నివృత్తుల సమ్మేళనంచేసి పరిపూర్ణ
మోక్షాన్ని సాధించడంలో, నియ
మబద్ధమైన సామరస్య జీవితం,
మానవులకు సహాయకరమే అన్న
నిర్ణయానికి వాళ్లు వచ్చారు.

ఈలాటి ఆర్యజీవన దృక్ప
థం టాగూరులో మూర్తీభవిం
చింది. జీవితం యొక్క వివిధ
దృక్పథాలను సమన్వయం చేసే
ఈ నేర్పే టాగూరును సమగ్ర
జీవిత సాధకునిగా, కవిగా దిద్ది
తీర్చింది. ఆయన అన్నిటినీ
అంగీకరిస్తూ పేటినీ తిరస్కరిం
చని కవి, తత్వవేత్త. ఆయన
తిరస్కారాన్ని మాత్రమే తిరస్క
రించాడు. అనాకారంగా, అప
శృతిగా, అసంబద్ధంగా వుండే
ప్రతిదాన్నీ తిరస్కరించాడు. ఈ
జీవిత భావనమే, భారతీయ సాహి
త్యానికీ, సంస్కృతికీ, తద్వారా
ప్రపంచ సాహిత్యానికీ, సంస్కృ
తికీ, టాగూర్ శాశ్వతంగా ప్రసా
దించిన ఆస్తిలో ప్రధానమైంది.

### పరిపూర్ణ జ్ఞానావిష్కరణ

ప్రపంచమంతటా భగవంతు
డు నిండివున్నాడనే జ్ఞానంద్వారా
ఈ జీవిత సమన్వయాన్ని, సమ
గ్రతనూ, అత్యంత ప్రాచీనకాలం
నుంచీ, భారతీయ హృదయం
అన్వేషించింది. భారతీయ
సంస్కృతిలో ఇది సుందరమైన,
ఉదాత్తమైన, విషయం, మన
దేవుడు, ఏతెగతోనూ జాతితోనూ
ఒడంబడిక చేసుకునే వర్గీయ
దేవుడుకాడు. తనకు కోపం
తెప్పించిన వారినీ, తన అధికా
రాన్ని ధిక్కరించిన వారినీ పగ
బూని పాలార్చే ఈర్ష్యాళువైన
దేవుడు కాడు. వైర్యాలనూ,
విభేదాలనూ, అహంకార పూరిత
మైన నాస్తికతలనూ అధిగమించి
విశ్వానంద కర్తయైన సమస్త
విశ్వాంతర్యామి మన దేవుడు.
మనదేవుడు సర్వశక్తిమంతుడు,
పరిపూర్ణ ప్రేమమయుడు. సమ
గ్ర జ్ఞానవంతుడు. పరమ కరుణా
మూర్తి. అమిత ఓర్పుగలవాడు.
అందువల్లనే జీవితంలోని బహు
పథాలను అర్థంచేసుకుని సంపూర్ణ
జీవనం సాగించడంమనకుసాధ్యమ
వుతుంది. భగవంతుణ్ని గురిం
చీ, జీవితాన్ని గురించీ, జీవితంలో
మనస్థానాన్ని గురించీ, మనభావన
అంత సమరసమైనది కాబట్టే,
మన మహా పురుషులు, ఎన్ని
అవాంతరాలు వచ్చినా సమచిత్త
తనూ, విశ్వాసాన్నీ, నిలుపుకో
గలుగుతున్నారు. "ఈ పరిపూర్ణ
జ్ఞానావిష్కరణమే టాగూరు భార
తీయ సాహిత్యానికి శాశ్వతంగా
ప్రసాదించిన ఆస్తి."

(తరువాయి 54-వ పుటలో)

# సత్య సందర్శనము

ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి

అన్నవరప్రభూ! హృదయ మన్నది కల్గిన తెల్గువాడు నీ
వున్న గిరీంద్ర సానుభవనోజ్జ్వల రేఖల గాంచినంతనే—
స్విన్నవిలోచనంబులను చేతులు మోడిచి, ఒక్కసారిలో
నున్న వెలుంగు లొత్తుకొను నూహల శీర్షము వంచిమ్రొక్కడే॥

అనియేదో యొకవేణునాద మటుమ్రోయన్ మ్రోయ నిత్యమ్మదే
పనిగా, నిల్వగ లేక పర్విడితి పంపాతీర పుణ్యావనీ
మణిశైలోపరి భద్రపీఠ నివసన్మన్మానసారాధ్య మో
హన తేజమ్మును కన్నులారగను నూహల్ దోహలంబై చనన్॥

పంపా తరంగిణీ పంకజగంధవాహ
        కుమారులసివాదు లరుగుచోట,
తొలియెండ తళ్కులో తలలూచు మున్నారు
        పూలనీడల దారి ఘొల్పుచోట,
అతిబాల వృద్ధభక్త్యావేశ ఫలపుష్ప
        వినమత్కరాంజలుల్ వెలయుచోట,
మదినన్న వరముల నిదెయిందమని చేయి
        చాచి యిచ్చునటంచు వేచుచోట

అద్వితీయమ్మునైన త్రైపాద్విభూతి
యంత్ర శిఖరాగ్ర దివ్యసింహాసనమున
నాయెడదతమ్మి పీఠ కనారతమ్ము
కదలి మ్రోసెడి గండుతుమ్మెదను గంటి

ఏమీఏమి ఋణానుబంధము ప్రభూ! ఇంతపై మాయమ్మగా
రాముల్ దా పచరించి యుగ్గిడిచుపాల్ ద్రావించునానాడె, నీ
నామమ్మున్ గరిగించి తీయగననున్ ద్రావించెనేమో కదే
ఆ మాధుర్యము జన్మలో విడువదయ్యా! రక్తసంబంధమై॥

బలిచక్రవర్తి యౌదల దివ్యపాదుకా
        సుకృతమ్ము వెట్టువస్తువులు గనగ,
కలశాబ్ధిరాజ చక్కనిచుక్క నీయ
        చేతులుబాచి కదుగువస్తువులు కనగ,
ప్రామిన్కువేల్పుల మ్రాకుల కొనకొమ్మ
        మెరయు కిసాల మంజరులు గనగ,
దివిపుట్టు నమృతమ్ము శివుజటాపుష్పమ్ము
        గంగమ్మ పుట్టింటిగడపలు గన

ఏమి ఏనాటికెనాటి కిపుడు పండె
నాదు సుకృతమ్ము స్వామిశ్రీపాదయుగళి
దర్శన మహోత్సవమ్మున తనివితీర
కన్నులకు వెన్నెలద్దు సుఖమ్ముతోచె!

అన్నాదమ్ములరేమొ నీవుమరి దక్షారామ భీమన్న-నీ
సాన్నిధ్యమ్మున నిల్వ నచ్చముగ దక్షారామ సౌధమ్ములో
నున్నట్లేయనిపించు, నచ్చటను మాయాహాన్ భవన్మూర్తి సం
పన్నంబౌ, బళి! తెల్గువారి పరమాద్వైతమ్ము సత్యంబటే!

ఎన్నడు పుణ్యచిత్తుడు మహీసుర ముఖ్యుడు రెడ్డిరాజ్య సం
పన్నలినీ రవిప్రభుడు మాధవ మాధవశీలి బెండపూ
డన్నయ మంత్రి యన్నవరమంచని యీపురి నిల్పె నాడె భ
మన్నకు తమ్ముడిందు వెలయంగల డంచుభవిష్యమెంచెనో!

తులసిదళాలు బిల్వములతో కలగల్పిన విప్రపూజలా?
వలపల నాగలింగ సహవాసమ? పైన త్రిపుండ్రధారణా
కలిత విలాసమా? నిలువగా శివయంత్ర కృతాధివాసమా?
బళి! బళి వైష్ణవుల్ దరియవత్తురె? ఏమి చమత్కృతుల్ ప్రభూ!

హరియంచున్ హరుడంచు కొందరిట నేకాక్షుల్ విజృంభించి నె
త్తురు వాకల్ పచరించి స్వీయమత ముద్ఘోషింపగా వేదవా
క్పరమార్థజ్ఞు డుదారు డాంధ్రుడు నవాద్వైతమ్ము రూపించెతత్
పరమోదాహృతి నీవుగాకెవరు దేవా! నిత్యసత్యాకృతీ!

అటుసింహాచల చందనార్త నరసింహస్వామివై, పైని వేం
కటశైలంబున కొల్వుతీర్చిన రమాకాన్త స్ఫురన్మూర్తివై
ఇటు రత్నాచల శేఖరాగ్రమణివై, ఈశానశ్రీ శాత్మక
స్ఫుటతేజమ్మొకడంచుతెల్పు శుభ చిన్మూర్తీ! కృపన్నిల్పవే!



టాక్సీ డ్రైవరుతో పరిచయము (మద్రాస్, మే 10)

# పరిపాలన-పౌరుడు-వికేంద్రీకృత ప్రజాస్వామ్యములు

[శ్రీ కె. వి. ఎస్. రామన్ ఆంగ్ల ప్రసంగానికి ఎస్. వి. శారద అనువాదం]

జాగృతమైన ఏభైఏండ్ల నిర్విరామ కృషి ఫలితంగా మనకు విదేశీయ పరిపాలననుండి విముక్తి లభించినది. తత్ఫలితంగా స్వీయమై, సుఖతరమై పరదేశములతో సౌజన్య-సామరస్యాలతో మనగలిగే రాజ్యాన్ని నిర్మించుకోవటానికి మనకు కావలసిన స్వేచ్ఛ లభించింది.

భవిష్యద్భారతావనిని గూర్చిన మన నాయకుల భావనలన్నీ మన రాజ్యాంగంలో నిక్షిప్తమైవున్నవి. మన రాజ్యాంగము సర్వసత్తాక ప్రజాస్వామ్య గణతంత్ర రాజ్యమును సృష్టించింది. కేంద్ర, రాష్ట్ర స్థాయిలలో ప్రజాప్రాతినిధ్యముగల ప్రజాస్వామ్యాలు రూపొందాయి. గ్రామ పంచాయతీలు జరిగే పరిపాలనలో ప్రజలు ప్రత్యక్షంగా పాల్గొనే అవకాశం మన రాజ్యాంగంలో కల్పించబడలేదు.

## ఆర్థిక అసమానత

స్వాతంత్ర్యోదయమైనప్పటినుండి ఎన్నో మార్పులు వస్తున్నాయి. వెనకబడియున్న ఎన్నో ద్వీపాల, భూస్వామ్యపద్ధతికి అలవాటుపడిన సంస్థానాల-పరిపాలనా సమైక్యతవల్ల ఇంత కాలానికి భారతదేశానికి స్థూలంగా ఒక రూపు ఏర్పడినది. కాని, దీని మూలంగా రాజకీయ, ఆర్థిక, అసమానతలు మరింత స్పష్టమైనాయి. ఈ అసమానతలను తొలగించవలసి యున్నది.

మన జాతీయ విధానంలో ఆర్థికాభివృద్ధి అంటే కేవలం ఆకలి, అనారోగ్యం, అజ్ఞానం మొదలైన ఈతి బాధలనుండి విముక్తి పొందడమే కాకుండా, సాధ్యపడినంత త్వరగా భారతీయ ఆర్థిక వ్యవస్థను సమృద్ధమైనదిగాను, స్వశక్తి చోదితమైనదిగాను రూపొందించాలన్నదే మరొక ముఖ్యవిషయము. అందుచేతనే మన ఆర్థిక పురోభివృద్ధి తన వేగాన్ని హెచ్చించింది. పారిశ్రామిక విప్లవం మన సంఘపు రూపును పునఃతీర్చి దిద్దుతోంది.

## సమాజ వికాసోద్యమము

సామాన్య పౌరులు తమ జాతీయ సమస్యల పరిష్కారంలోను—అభివృద్ధి కార్యక్రమాలలోను పాలుపంచుకుని ఉత్సాహం ప్రదర్శించినపుడే ప్రజాస్వామ్యం సుస్థిరం కాగలదు. గ్రామీణ సమాజాలు సక్రమాభివృద్ధిని సాధిస్తున్నాయి. జాతీయ విస్తరణ సేవ ముఖ్యోద్దేశం స్వశక్తి మీద ఆధారపడి పెంపొందే గ్రామీణ అభివృద్ధి కార్యక్రమాలకు దోహదమివ్వటమేకాని, ప్రత్యక్షంగా యీ సేవ ఏ పనిని సాధించలేదు. ఈ విధముగా ఈ కార్యక్రమము వ్యక్తి స్వాతంత్ర్యానికై సంక్షేమయుక్త పరిపాలనాన్ని ప్రజాస్వామ్య పద్ధతిని పటిష్ఠం చేసింది. అభివృద్ధి కేంద్రముల పరిపాలనలో ప్రజలనుండి సుసంఘటితమైన సహకారము లభించినది. తక్కిన వానితోబాటు సమాజ వికాసోద్యమము కూడ విజయవంతమగుచున్నది. గ్రామాలలో ఉన్న ప్రతి సామాన్యుడీ సమాజ వికాస కార్యక్రమములో తాను పాలుపంచుకొనవలెననే ఆసక్తి చూపుచున్నాడు.

## జాప్యానికి వీలులేదు

ఇటీవలివరకూ-స్థానిక స్వపరిపాలన కొదిపాటి అధికారాలు విధులు కలిగిన జిల్లాబోర్డులు, లోకల్‌బోర్డుల వరకే-పరిమితమైనది. లోక సేవలోగాని లేదా మరే ఉద్యోగాలలోగాని జొరబడలేని స్థానిక శక్తి అంతా కేంద్ర, రాష్ట్ర, విధాన సభల వైపు మళ్ళింది. పై స్థాయిలలో అధికార స్వాతంత్ర్యం ప్రబలడముతో క్రింది స్థాయిలను అలక్ష్యము చేయటము, లేదా వాని విషయములో జోక్యము కలుగచేసికోటము తటస్థించినది. లోకల్ బోర్డులను అభివృద్ధి వరచుటకు బదులు, రాష్ట్ర ప్రభుత్వాలు వాటిని రద్దుచేశాయి. బ్లాకు స్థాయికి క్రింద ఉన్న గ్రామ పంచాయితీలు, బ్లాకు, పరిషత్తుల ప్రతినిధులతో గూడి, బ్లాకు స్థాయి కన్న పై స్థాయిలో ఉన్న జిల్లా పరిషత్తులను ఇప్పుడే నెలకొల్పుకొనుచున్నవి. వీని సంవిధానము అధికారాలు, కర్తవ్యాలు, జిల్లా, బ్లాకు, గ్రామ స్థాయిలలో వీని ధర్మాలు, ఇవన్నీ కూడ ఇప్పుడిప్పుడే ప్రజల ధ్యానాన్ని ఆకర్షిస్తున్నాయి. కనుక వికేంద్రీకృత ప్రజాస్వామ్య ధర్మాలను నిర్దేశిస్తూ రాజ్యాంగములో వీనిని పొందుపరచడములో ఎంత మాత్రమూ జాప్యము కలగడానికి వీలులేదు.

## పంచాయితీలు అనువైన ప్రాతిపదికలు

సమాజము ఎంత చిన్నదిగా ఎంత సన్నిహితముగా అల్లుకుని ఉంటే అంతగా సాంఘికమైన విలువలు వ్యాప్తమవుతాయి. సుస్థిరమైన ధర్మాలలో శిక్షితులైన నిపుణుల వ్యాఖ్యానముతో భేదాభిప్రాయాలు సమసిపోవటానికి కూడా అవకాశము లభిస్తుంది. ప్రతివ్యక్తి-సమాజాభివృద్ధిలో తానూ భాగస్వామినేనని, ప్రజాక్షేమము పెంపొందించటములో తనకూ అవకాశమున్నదని గుర్తిస్తే, ఆ సమాజము కోసము తన వ్యక్తిగత సుఖాన్ని కొంతైనా స్వచ్ఛందముగా వేరే ప్రోద్బలముతో నిమిత్తం లేకుండా త్యాగము చేయకలుగుతాడు. దీనికొఱకై సమాజములోని ప్రజ తరుచు సభలు, సమావేశాలు జరుపుకోవాలి. ప్రజాభిప్రాయాన్ని కూడ సేకరించాలి. ఇల్లాంటి ప్రత్యక్ష ప్రజాస్వామ్యములో ప్రతి వ్యక్తికి గరిష్ఠ సంతృప్తి లభిస్తుంది. వ్యవహార కార్యక్రమంలో ఉన్నవారు పౌరుల ప్రత్యక్ష అజమాయిషీక్రింద పనిచేస్తూ, ఆ పైని వచ్చే హెచ్చు తగ్గుల కన్నిటికీ వారే సంజాయిషీ ముఖ్యంగా గ్రామీణులకే చెప్పుకోవలసి ఉంటుంది. స్వలాభాపేక్షకి అవకాశము అంతగా ఉండదు. యజమాని సేవక భేదముకూడా అంతగా ఉండదు. ఇలాంటి సమాజాన్ని ఏర్పరచుకొనుటకు గ్రామ పంచాయతీలు అనువైన ప్రాతిపదికలు. ఈ

గ్రామ పంచాయతీలే ప్రజాస్వామ్యమునకు పునాదులు. ఐదు వందలు మొదలు ఆరు వందల కుటుంబాల వరకు ఒక కొలమానముగా ఎంచుకొన్నచో అట్టివి ఇరువది చేరిన మండలము బ్లాకు, ఒక చిన్నదైన యూనిట్ అగును. స్థానిక సమస్యలన్నీ బ్లాకు స్థాయిలోనే చర్చించబడి పరిష్కార మార్గాలు కూడ, అక్కడే నిర్ణయమవుతాయి.

## కూడగట్టుకు రావాలి

దాదాపు 75 వేల జనసంఖ్య కలిగి సగటున ఒక వంద చదరపు మైళ్లు విస్తీర్ణముగల ప్రతి ప్రాంతానికి ఒక మండలము ఏర్పాటు చేయబడినది. ఈ బ్లాకు స్థాయిలో సాంకేతిక సిబ్బందితో కూడిన పరిపాలనా యంత్రాంగముంటుంది. దీని కార్యక్రమము ప్రతిపాదిక ప్రజాస్వామ్యానికన్నా కొంత భిన్నముగా ఉంటుంది. ప్రభుత్వ పరిపాలనకూడ న్యాయ సమ్మతముగా ప్రజా సేవకులచే నిర్వహింపబడుతుంది.

బ్లాకు పరిషత్తును నిర్వహించే వ్యక్తి గ్రామ నాయకులకందరికి ఆయా రంగాలలోని వివిధ సమితులలో ప్రాతినిధ్యమిచ్చి వారి నందరను కూడగట్టుకు రావాలి. ఏ ఒక్క కులము, సంఘము, వృత్తి లేదా ఏ ఒక్క ప్రాంతము వారికి కూడ తమ సంగతెవ్వరూ పట్టించుకోనైనా లేదనే భావన రానీయకుండా చూచుకోవాలి.

## సరిసమానంగా పరిపాలనా భారం

ఆంగ్లేయులకాలములో పరిపాలనా నిర్వహణ వ్యవస్థకు మూలకందముగా జిల్లావుంటూ వచ్చింది. ఇప్పుడు అనుసరించే విధానాలకు, మార్గావలంబనకు, అజమాయిషీకి కార్యనిర్వహణకు కూడా జిల్లాయే ప్రాతిపదిక అయినది. ఈ విధముగా, విధానావలంబన, అజమాయిషీ, నిర్వహణ కూడ జిల్లాస్థాయిలోనే సాగుతున్నాయి. ఈ అధికారాలు కాకుండా, జిల్లాధికారి ప్రతినిధిగా, ఆ జిల్లాలో ప్రభుత్వశాఖలు సక్రమముగా తమ తమ ధర్మాలు నిర్వహించేటట్లు చూచే బాధ్యతకూడా వహిస్తాడు. ఈ జిల్లా స్థాయిలోనే ప్రజల కార్యకలాపాలను క్రమముగా ప్రవేశపెట్టాలి. జిల్లా పరిషత్తు ఒక సలహా సంఘములాగా వుండి, రెవిన్యూ సేకరణ పరిపాలన శాంతి భద్రతలు రక్షణ మొదలగు విధులను ప్రజల పరం చెయ్యాలి. ముఖ్య జిల్లాధికారి అవసరమైనప్పుడు జిల్లా పరిషత్తుతో సంప్రదించే హక్కు ఉండాలి. పరిషత్తుకూడ ముఖ్యమైన విషయాలను చర్చించే ముందు జిల్లాధికారుల అభిప్రాయాలను సేకరించడము వారి ధర్మము, హక్కుకూడాను. పరిషత్తు సభ్యులు జిల్లాధికారుల మధ్య అభిప్రాయ భేదా లేర్పడినప్పుడు కమీషనర్‌నుగాని, రాష్ట్ర ప్రభుత్వాన్నిగాని సంప్రదించిన తర్వాత తుది నిర్ణయాలు తీసుకోవటం మంచిది. నిపుణుడైనవాడే సివిల్ ఉద్యోగ బృందాన్ని, వృత్తివిద్యలలో ప్రవీణులను కూడగట్టుకొని ఆయా రంగాలను నడపగలడు. ఒక వేళ ఏ రంగమైనా పెడదారి త్రొక్కితే పౌరులే ఆ లోపాలను యెత్తి చూపించాలి. వెంటనే, ఆ రంగాన్ని నిర్వహిస్తున్నవారు తమ పొరపాట్లను సరిదిద్దుకోవాలి. రకరకాలుగా ఉన్న జిల్లాలను పునర్వ్యవస్థీకరించడమనేది అత్యవసర కార్యాలలో ఒకటి. ప్రతి జిల్లాలకు సాధ్యపడునంత రాజ్యాన్నే పరిపాలన కివ్వాలి. పది లక్షలు జనాభా కలిగిన ప్రతి పదిహేనువందల చదరపు మైళ్ళ విస్తీర్ణముగల ప్రాంతాన్ని ఒక జిల్లా పరిషత్తుగ నిర్ణయిస్తే, పరిపాలనా భారము అన్ని పరిషత్తులకు సరిసమానముగా వుండేందుకు వీలుకలుగుతుంది.

## రక్షించగల మార్గము

ప్రతి జిల్లాలోను, విభిన్న తరగతులకు చెందిన ప్రజలుంటారు. పారిశ్రామిక, ఖనిజ, వాణిజ్య కేంద్రాలలోను, భారీ సంస్థలలోను, ఇంకా ఇతర సంస్థలలో ప్రత్యేకావసరాలకు పాటుపడే ప్రజలు, విభిన్న తరగతులకు చెందినవారు వుంటారు. దేశ స్థితికి జిల్లాలు మచ్చుతునకలుగా వుంటాయి. కాని ఈ స్థాయిలో సమాజరూపం వేరుగా వుంటుంది. పెద్ద పెద్ద పట్టణాలలో చిన్నచిన్న కులాల తత్వమే వుండదు. క్లిష్టమైనప్పటికి, ఆర్థికముగా పొందిక కలిగిన

(తరువాయి 52 వ పుటలో)



కొత్తగా ఏర్పడ్డ కేంద్ర మంత్రివర్గములో రేడియో, సమాచార శాఖా మంత్రిగా నియమితులైన శ్రీ బెజవాడ గోపాలరెడ్డి రాష్ట్రపతి డా॥ రాజేంద్ర ప్రసాద్ ఎదుట పదవీస్వీకరణ చేయు దృశ్యం

# చూడగలగాలేగాని, అడుగడుగునా బోలెడుపని

పి. వి. రామచంద్రమూర్తి

ప్రతి రోజూ సాయంత్రాలం సుమారు ఆరుగంటల సమయాన, హైదరాబాదు నగరంలో హుసేన్ సాగరం వైపు వాహ్యాళికి వెళ్ళే ఒక వ్యక్తిని మీకు పరిచయం చేస్తాను. ఆయన మాంచి పొడగరి. చాలా చురుగ్గా అడుగులు వేస్తూ నడుస్తాడు. ఆ సరోవరం వైపు నడిచిపోయేవాళ్ళ నందరినీ ఇట్టే దాటుకుపోతాడు. కాని మధ్యమధ్య—సడెన్‌గా బ్రేకు పడ్డ కారుకుమల్లే—చటుక్కున ఆగిపోతూ ఉండడంవల్ల వెనక బడ్డ వాళ్ళకు ఆయన కనపడుతూనే ఉంటాడు.

ఒకనాడు నేను 'అడుగడుగునా ఆయనను అలా ఆపేనేదేమిటి!' అని పరిశీలించి చూశాను. ఎవడో అనాలోచితంగా రోడ్డుపైన పారేసిన అరటిపండు తొక్క ఒకటి [illegible] ప్రత్యక్షమైంది. ఆయన [illegible] చేతికర్రతో ఆ తొక్కను నేర్పుగా ఎత్తి బాటప్రక్కకు తీసుకుపోయి పడేశాడు. చూసుకోకుండా ఎవరైనా ఆ తొక్క పైన కాలువేసి జారి ప్రమాదానికి ఎరగావచ్చునన్న దూరపాలోచనకు ఉపకార బుద్ధితోడై ఆయన చేత [illegible] ని చేయించింది. ఆ తర్వాత మరో పదిఅడుగులు వేసి, మళ్ళీ ఆగిపోయాడు. ఈ సారి ఆయనను ఆపివేసినది నిప్పుతో వున్న ఒక సిగరెట్టు ముక్క? పాదరక్షలు లేని పథికుడెవరైనా చూసుకోకుండా దాన్ని తొక్కడం జరిగితే కాలుతూవున్న ఆ సిగరెట్టు పాముకుమల్లే కాటు వేయవచ్చు. ఆ ఆలోచనతో ఆయన తన బూటుతో ఆ ని[illegible] రాసివేసి కాని [illegible]గుపే[illegible]డు. ఆ సిమెంటు రోడ్డుపైన [illegible]క్కమూ కదళీఫల కవచములూ, ధూమకాష్ఠ శకలములూ అలా పడుతూనే ఉంటాయి. వాటిని చూడగలిగినవాడూ చూచి పనికల్పించుకునేవాడూ పరోకార పరాయణుడైన ఆ వ్యక్తి ఒక్కడే.

## మెచ్చుకోదగ్గ ఉపకారము

మా సన్నిహిత బంధువులలోనే ఒకాయన ఉన్నాడు. అతనికి స్వగృహములో కానివ్వండి, ఇతరుల ఇళ్ళలో కానివ్వండి—వీధిలో కానివ్వండి, పొలములో కానివ్వండి—అడుగడుక్కీ బోలెడుపని కనపడుతూనే ఉంటుంది. నేనూ అతనూ వాళ్ళింటి మండువాలో కుర్చీలలో కూర్చుని మాటాడుకుంటూండగా ఊడవడానికని పనిమనిషి చీపురు పుచ్చుకువచ్చింది. నేను పక్కనున్న వరాండాలోకి వెళ్ళి తచ్చాడుతున్నాను. అతడలా రాకుండా మండువాలోని ఒకొక్క కుర్చీనీ మంచాన్నీ ముందుకులాగి ఆమె ఆ పేర అంతా తుడిచి వెయ్యడంతోనే ఆ ఫర్నీచర్ని యథాస్థానానికి చేరుస్తూ వచ్చాడు. నేను చూస్తూ ఊరుకోక "నువ్వు సోఫాలను అలాగ లాగకపోతే ఆమె పైపైన మాత్రమే ఊడ్చి చక్కాపోతుందనేనా నీ భయము?" అన్నాను. "అదికాదు, ఈ కాసంతసేపూ ఊరికే నిలబడి యేం చేస్తాముగనక? మనము ఇలా కాస్త సాయంచేస్తే ఆ మనిషి చీపురు కింద పడెయ్యక్కర్లేకుండా ఏకటాకీని ఊడ్చి చక్కాపోతుంది" అన్నాడు. ఆ ఉపకారం చాలా చిన్నదే అయినా మెచ్చుకోతగ్గదనిపించింది నామటుక్కి.

"పొలము వెడదాము రా. నీకు నడిచినట్టూ వుంటుంది, నాకు పని చూసుకున్నట్టూ వుంటుంది" అన్నాడొకసారి. నడిచినంతసేపూ మేఘ సందేశములోని ఒకొక్క శ్లోకం చదివి వ్యాఖ్యానించి ఆ కావ్యములోని అందాలను చూపి ఆనందం కలిగించాడు. నడుస్తోనడుస్తో చటుక్కున ఆగేడు. ఏమిటి చెప్మా? అని పరికించేసరికి తాటిమట్టల మోపును తలకెత్తేవాళ్లు లేక దిక్కులు చూస్తోన్న వృద్ధుడొకడు కనపడ్డాడు. "గంగులూ-నేనెత్తుతాను పట్టు" అంటూ—"తమరెత్తట మేమిటి కామందులు?" అని ఆ ముసలివాడు అభ్యంతరము చెపు



వారిదగ్గరనుండి జాబు

చిత్రకారుడు—ఎమ్. శంకర్రావు

తున్నా-వినిపించుకోక-ఆ మోపును యెత్తి చక్కా వచ్చాడు.

## పేకాట పేచీ

వ్యవసాయపు పనులు లేని రోజుల్లో ఆ గ్రామస్థులకు తీరికగానే వుండేది. అప్పుడు అరిగిపోయిన పేకముక్కల్ని బైటకు తీసి పొద్దస్తమానం వాటితో కాలక్షేపము చేసేవారు. ఆ పేకాట ఒకొక్కప్పుడు పేచీలకు దారితీసి సిగపట్లవరకు వెళ్ళేది. అతనికి పేకాట అంటే కిట్టేదికాదు పనికి వచ్చే పనులు బోలెడు కనపడే వతనికి ఓ సారి మేము ఇద్దరం వీధమ్మట వస్తోంటే రామమందిరము పరిసరాల పై పాతని దృష్టి మళ్ళింది. "నువ్వు పద. నేను వస్తాను." అంటూ అతడు ఒక కొబ్బరి పువ్వును పుచ్చుకుని ఆ దేవాలయము చుట్టూ ఊడవటం ప్రారంభించాడు. నాకు అడుగు పడక అక్కడే నిలబడిపోయాను. కొంతసేపు అయేసరికి పేకాట గుద్దులాటగా మారి ఒహణ్ణొకడు తరుముకుంటో తిట్టుకుంటూ ఆ వైపు హడావుడిగా వచ్చారు. ఆయన "ఏమిటా! ఈ రభస?" అని అడిగి తెలుసుకుని—"మీ తగవు ఎలా పరిష్కారం చెయ్యాలో కొంచెం ఆలోచించి చెపుతాను. ఈ లోగా మీ రిద్దరూ చెరోవైపూ ఊడ్చి శుభ్రము చేసి రండి" అన్నాడు.

ఆయనకు వాళ్ళ యింట్లోనే కాదు మరెక్కడికి వచ్చినా పని కనపడుతోనే ఉండేది. హైదరాబాద్ వచ్చినప్పు డాతనికి మా యింట్లో బూరుగుకాయ లున్న బుట్ట కంటపడింది. మేము అప్పుడు రేడియో వింటున్నాము. "అమ్మాయ్! ఈ బూరుగుకాయలను ఇలాగే ఉంచేశావేమిటి? ఇలా అశ్రద్ధచేస్తే ఇందులోని దూది మట్టిఅయిపోయి, హాయి లన్నీ కరిమింగిన వెలగపళ్ళ కరిణి అయిపోతాయి" అన్నాడు. "నిరుడేడు పెరట్లో రాత్తే పోగు చేసి పెట్టేను. పగలగొట్టి దూది తియ్యటానికి ఎప్పటికప్పుడే కుదరటము లేదు" అన్నది-మా గృహిణి. అతడు ఒకొక్క కాయనే తలుపు సందున పెట్టి నొక్కి ఫళుక్కు మనిపించి, ఆ పగిలిన కాయలన్నీ ముందు వేసుకొని రేడియో ప్రోగ్రాము వింటూనె దూది పింజల్ని పైకిలాగేశాడు.

## సామాన్యులు, మాన్యులు

ఇవి వింటూంటే చాలా సామాన్యవిషయాలనిపిస్తుంది మనకి కాని ఆలోచించి చూస్తే. పరనిందలో కాలం వృధాచేసే వాళ్ళెక్కువా ఇల్లాంటి చిన్నచిన్న ఉపకారపు పనులైనా చేసేవాళ్ళుచాలా తక్కువాఅని తెలిసి సామాన్యులే మనకెంత మాన్యులో తెలిసొస్తుంది.

ఉపకార బుద్ధి అనేది స్వతహాగా ఉండాలి కాని నేర్చుకునేది కాదనుకుంటాను. కొందరికి ఏ మాత్రము ఉపకారమన్నా చేయ బుద్ధెయ్యదేమిటో?....ఒకసారి నేను స్టాండులో బస్సుకోసము ఎదురు చూస్తున్నాను. రైలు ప్రయాణము పెట్టుకుని నిలబడ్డ ఒకాయన బస్సు ఎప్పటికీ రాకపోవడముతో రైలును అందుకోలేనేమో అని ఆదుర్దా పడసాగేడు. పక్కన రిస్టువాచీ పెట్టుకు నిరీక్షిస్తోన్న ఓ యువకుని కేసి చూసి "టైమెంతైంది సాబ్?" అని వాకబుచేశాడు. ఆ గడియారపాయన "నూటపాతిక రూపాయలు పోసి రిస్టువాచీ కొనుక్కుంటే నీకు టైము చెప్పడానికేనా?" అన్నట్టుగా ఒక విషపు చూపు చూసి ఊరుకున్నాడేకాని టైము చెప్పేదేకాదు. నేను విస్తుపోయి ఇలాంటి మన స్తత్వం కలవాళ్ల అధిక సంఖ్యాకులైతే ఈ ప్రపంచం గతేంకాను?" అనుకున్నాను. "అందరూ ఇలాంటి వాళ్లు కారు" అని చెప్పడానికో అన్నట్టు, ఆదారిని వల్లభరావుగారు తమ కారులో వచ్చారు. నన్ను చూడటముతోనే కారు నాపించి "ఆఫీసుకేనా? ఎక్కండి" అన్నారు. నేను రైలుకి వెళ్ళవలసిన ఆయనకేసి చూపుతో "ఆయన ట్రైనుకు టైమైపోతోందని ఆదుర్దా పడుతున్నాడు పాపం" అన్నాను. "స్టేషను మన దారిలోనేగా ఎక్కమను" అన్నాడు వల్లభరావు. అక్కడితో ఆగక ఆ రిస్టువాచీవాణి కూడా ఆహ్వానించి కూచోబెట్టుకున్నాడు వల్లభరావు. ఇది చాలా చిన్న సంఘటనయే అయినా ఒక వ్యక్తిలోని అల్పత్వాన్ని అదే సమయములో మరొక వ్యక్తిలోని ఆధిక్యమునూ వ్యక్తపరుస్తోంది గనక ఈ సందర్భములో జ్ఞాపకానికొచ్చి చెప్పేను.

## గ్రామసేవ

మా జిల్లాలో గోదావరి ఒడ్డున ఒక గ్రామము ఉన్నది. సుమారు పాతికేళ్ళ క్రితం నేనా ఊరు వెళ్ళేను. కోవెలా, కోవెల ప్రక్క కోనేరు ఉన్న గ్రామమది. స్త్రీలు బిందెలతో నీళ్ళు ముంచుకుని పట్టుకువెడుతున్నారు. ఉన్నట్టుండి ఆవలి గట్టునుండి పొలికేకలు వినిపించాయి. ఆ స్త్రీలలో ఒకామె చెరువులో స్నానానికని దిగబోతూంటే వారింపటానికి కాపలావాడు వేసిన కేకలవి. "స్నానం చెయ్యకుండాను బట్టలు ఉతక్కుండాను చెరువును ఇంత కట్టుదిట్టం చెయ్యగలిగిన నాయకుదెవర"ని వాకబుచేస్తే ఆయన పేరు చెప్పేరు. వారిది పండిత కుటుంబమట. అతిథిసత్కారానికి పేరుపొందిన కుటుంబము కరువు రోజులలో ఒక అర్ధరాత్రిని ఒక తండగా జనంవచ్చి 'తండ్రీ తిండిలేక మాడిపోతున్నాము' అని మొరపెట్టుకోగా ఆ యజమాని నిద్రపోతోన్న స్త్రీ జనాన్ని లేపకుండాతానే వంటచేసివడ్డించినాడట. ఆ మహనీయుని కుమారుడే ఆ గ్రామానికి నాయకుడు. ఆయన ఇప్పుడు కీర్తిశేషుడు. ఆయనకు కీర్తిని తెచ్చినది ఆ గ్రామానికి ఆయన చేసిన ఉపకారము. అది ఒక రకమైనదికాదు. పంచాయతీ పాలనలో ఆయన పని కనపడుతుంది. పాఠశాలలో ఆయన పై చేయి ప్రత్యక్షమౌతుంది.. ముఖ్యంగా చెప్పదగ్గది సహకార రంగములో ఆయనచేసిన అద్వితీయమైన కృషి. సహకారోద్యమము ఎన్ని రకాలుగా ప్రజలకు తోడ్పడగలదో అన్నిరకాల సంఘాలు ఆయనవల్ల ఏర్పాటయ్యాయి ఆ గ్రామములో. ఆ కోనేటిగట్టున అరుగుపైన కూర్చొని అనాడు విన్నమాటలవి. అక్కడే కూర్చున్న మరొకనికి ఆ ప్రశంస అసూయవల్ల కాబోలు కిట్టింది కాదు. ఆయనకుమల్లే ఆస్తి ఉంటే మనమూ చెయ్యొచ్చు సేవ? అంటూ మూతి విరిచేశాడు. నాతో అంతసేపూ ఆ నాయకునిగూర్చి ముచ్చటిస్తోన్న పెద్దమనిషికి వళ్లుమండి ఆస్తికలవాళ్లు మన గ్రామములో ఎంతమంది లేరు? వారంతా ఎం చెయ్యగలిగేరు? అని విమర్శకుడి నోరు నొక్కేడు.

## తీరిక అంటే ఏమిటి?

మా పక్క వాటాలో కాపురము ఉంటూన్న పెద్దమనిషి ఇటీవలే రిటైరైనాడు. అప్పటినుంచి ఆయన సతీమణి బెంగపెట్టుకుంది. ఆయన ఆరోగ్యం తగ్గిపోయిందని కాదు ఆమె బెంగ. అంతవరకూ సులో పొద్దస్తమానం కాగితాలతో సతమతమవుతున్న ఆయనకు రిటైరైపోయాం, అనడంతోనే పాటారిపోయిన యేటిలో పడవలా ఒక్కసారిగా గమనము ఆగిపోయి ఇంక ఏమి చెయ్యాలో తోచిందికాదు, తోచక దిక్కులు చూడసాగేసరికి చుట్టూ ఉన్న గోడమూలలో బూజులూ గత్రాప్రత్యక్షమైనా దులపకుండా ఇలాగే ఉంచేశావేమిటి? అంటూ ఆమెను సాధించటం ప్రారంభించాడు. తీరికగా ఉన్న ఆ కళ్ళకు ఆ యింట్లో ఎక్కడ చూచినా లోపమే కనపడింది. తీరికగా ఉన్న ఆ చేతులతో ఆ లోపాలను సవరించకూడదూ పాపోసి? ఆహా? నోటితో మాత్రమే పనిచెప్పి ఆ యిల్లాలిని సాధించి వేధిస్తున్నాడే కాని ఇక్కడ పుల్లతీసి అక్కడ పెట్టడమంటే ఒప్పడు.

కీర్తిశేషులైన డాక్టరు పట్టాభిగారు 'విశ్రాంతి' అనే పదానికి చక్కటి నిర్వచనం చెప్పేరు. 'విశ్రాంతి' అంటే ఒకపని చేశాక పరుండి నిద్రపోవటంకాదు, ఏదో ఒకపనిజేసి అది మొహం మొత్తకుండా మార్పుకోసం మరొక పనిలో నిమగ్నమవటమే విశ్రాంతి అన్నారా అనుభవశాలి. రిటైరైన వారంతా ఒక పనిలోంచి ఒకపనిలోకి మార్పుగా మాత్రమే భావించి, తమశక్తి సామర్థ్యాలకు తగ్గపని యేదో పూనుకుంటే వాళ్ళకు కాలక్షేపమూ అవుతుంది, పరులకు ఉపకారమూ ఔతుంది.

అనుక్షణం పనిని చూడగలిగి ఆ పనులనుచేసి వెళ్ళిన కర్మవీరులు స్త్రీలలోనూ పురుషులలోనూ చాలా మంది ఉన్నా. వారిలో కొందరి స్వీయచరిత్రలు మనకు లభ్యమయాయి. కాని వారు అడుగడుగునా చేసిన ఘనకార్యాలన్నీ ఆ చరిత్రలలో కనపడవు. కారణము గ్రంథవిస్తరభీతి కావచ్చు. ఉదాహరణకు గాంధీగారి ఆత్మకథని తీసుకోండి. దరిమిలాన మహాత్ముని గూర్చి వెలువడిన సంపుటాలను చదివినవారికీ-ఆయన చేసిన మహాకార్యాలెన్నో ఉన్నాయనీ- అవన్నీ ఆత్మకథలో కానరావనీ తేల్తుంది. వీరేశలింగం పంతులుగారిని నేనెరుగను కాని తిలకమూర్తివారిని ఎరుగుదును. ఆయన గొప్పతనమంతా వారి స్వీయచరిత్రలో వెల్లడి కాలేదు. రఘుపతి వెంకటరత్నం నాయుడుగారిలాంటి కర్మవీరుల చరిత్రలు లిఖింపబడనేలేదు అది మన దురదృష్టం. ఈ కర్మవీరులంతా అడుగడుగునా పనిని చూడగలిగి, చేయగలిగారు. మనము చేయదలుచుకుంటే చాలా ఉంది పని. ఎప్పుడోనాడు వెంటనే చెయ్యాలి ఏమంటారు? కాలం ఒకరికోసము ఆగేదికాదు.



కాశీనాథ్ ముఖర్జీ: సితార్
(ఇటీవల హైదరాబాద్ నుండి ప్రసారితము)



జి.పి. వారియరీ (రైల్వే సప్తాహ సందర్భంలో ప్రసంగము, ఇటీవల ప్రసారితము)



తిరువావడుదురై ఎ. అణ్ణామలై: నాదస్వరం
(మద్రాస్, మే 7)

# విజంవవిలాస కావ్య సౌందర్యభావన

శ్రీరాం వేంకటభుజంగరాయశర్మ

త్రేనెవాకల లంకల్లో పెరిగిన చేమకూర....అని దువ్వూరి రామిరెడ్డిగారు కాబోలు, తమ సాహిత్య వ్యాసాల్లో ఎక్కడో అన్నట్టు జ్ఞాపకం.

ఎంత బాగా అన్నారు! ....తేనెవాక లంకల్లో పెరిగిన చేమకూర!!

ఎంత కమ్మని కూర; రుచి తెలిసినవాళ్ళకి పేరు నస అయినా, కవిత్వం పస అన్నది సాహితీ విదులు పరిపాటిగా చెప్పుకునే సామెత. తనపేరు ఊరూరా ప్రాకి తన కవిత సామెత కెక్కడానికి నిజంగా వెంకటకవి ఎన్నివేల రసిక హృదయాలకు గిలిగింత పెట్టి ఉండాలి! ఇన్ని తరాలుగా.

నిజం....ఈ నాలుగురోజులూ నా మనస్సులోనూ పన్నీరు చిలికి నట్టేఉంది, విజయవిలాసం చదువు తున్నంతసేపూ....ఎంత చల్లదనం ఎంతహాయి!....

ఉలూపి

భారత కథతో పోల్చిచూస్తే యీ ఉలూపి ఎంత స్పృహణీయంగా తోస్తుంది. ఈపాత్రను నిర్మించటంలో ఎంత మోహాన్ని ఎంత సౌందర్యాన్ని ఎంత వివేకాన్ని కలిపి ముద్దగా చేశాడు కవి.

ఉలూపి కేవలం కామినిగా తోచటంలేదు, ఎంతఆలోచించినా. గంగాతీరాన జపం చేసుకుంటున్న అర్జునుణ్ణి తన ప్రభావంవల్ల అంతఃపురానికి తీసుకుపోయిన తెగువతనం చూచాకకూడా ఆమె కామవిహ్వాల అనిపించటంలేదు. ద్రౌపదీ స్వయంవరానికి పోయి వచ్చిన కామరూప భోగులవల్ల అర్జునుని వృత్తాంతం విన్నప్పటి నుంచీ ఆమె అతనికోసం కలవరిస్తున్నది. ఎదురుతెన్నులు కాస్తున్నది. ఆమె అమలిన భావోద్వేగచిత్త. ఏ కాపట్యమూ ఎరుగదు. ఏమోమోటమూ తెలియదు. మనసువిప్పి మాట్లాడటమేగాని తెరచాటు మాటల జోలిలేదు. అచ్చపు వలపుతో పరవశించిన ఆ నాగతరుణికి మానవలోక మర్యాదలు పాపం ఏవీతెలియవు!

ఆపుకోరాని తన ప్రణయోద్వేగాన్ని, తన నిర్మల స్నేహాన్ని తన కన్యాత్వాన్నీ నిర్భయంగా ఆర్ద్రంగా వివరించిచెప్పింది విజయునికి. తన కన్నులమీద ఒట్టు పెట్టుకున్నది. తన వలపు కస్తూరి నామంతోడు అనిచెప్పింది. ఇంకా తనను నమ్మకపోతే నీదుమోవి మధురామృత మానిట బాసచేసెదన్....అని పలికింది....అప్పుడర్జునుడు బిగువుసడలి....

చక్కెరబొమ్మ నావ్రతము చందము దెల్పితినంతెకాని నీ
చక్కదనంబుగన్న నిముసంబయినన్ నిలుపోవ శక్యమే

అక్కున జేర్పక....

అన్నాడు పొంగులెత్తే తమకంతో.

ఆమాట వినేసరికి—ఉలూపికి పుట్టెడు సిగ్గు ముంచుకు వచ్చేసింది. ఆ సిగ్గుచూసి అర్జునుడు దిగ్భ్రాంతి చెందాడు. కవికూడా విస్తుపోయాడు. ఒక్కక్షణం ఆగి సంబాళించుకుని 'ఇంతలో ఎక్కడనుండి వచ్చె తరళేక్షణకున్నును సిగ్గుదొంతరల్'....అని ఆశ్చర్య పడుతున్నాడు వెంకటకవి....

నిజమే ఆసిగ్గు ఎలావచ్చింది? ఎక్కడనుంచి వచ్చింది? ఎవరికి తెలుసు?

అది సిగ్గుకాదట, సిగ్గుదొంతరలట, వట్టి సిగ్గుదొంతరలుకావు. నునుసిగ్గు దొంతరలు! అవి ఎలా వచ్చాయో, ఉలూపికికూడా తెలియదు. ఇదివరకెన్నడూ అనుభవించి యెరుగని విచిత్రమైన చకితత్వం కలిగింది ఆమెకు అర్జునునిమాటలు వినేసరికి. అది తన మనస్సునీ శరీరాన్నీ లలితంగా అవశం చేసింది. ఆ అవశతలో ఆమె కదిలిపోయింది. మెలికలు తిరిగింది. కళ్ళెత్తి అర్జునుని చూడలేక పోయింది.

ఆ మధురమైన అనుభవం ఆమెలో తరగలుతరగలుగా పొరలింది. ఆ తరగలే నునుసిగ్గు దొంతరలు. ఓయి వెంకట కవీ, నీవూ నీ ఉలూపీ మా సాహిత్యానికి జీవగఱ్ఱలు. నీవు ఉలూపిని సృజించావు. ఉలూపి నీ యశస్సును పండించింది. మీ దిరువురూ కలిసి రసజ్ఞతను చరితార్థం చేశారు.

సుభద్ర

ఇక సుభద్రార్జునుల కమనీయ గాథ వచ్చి కస్తూరి వలపు వలె ఎంతకూ మనస్సును వీడదు. ఆద్యంతమూ ఆర్ద్రసుకుమారంగా సాగిన రచన అది. అడుగో, మృదూర్ధ్వ పుండ్రంబు దీర్చి సన్న్యాసి వేషాన్ని ధరించిన విజయుడు.

అంగనల పొందురోసి సన్న్యాసి యగుట
గద యుచితమెందు, నా నవమదన మూర్తి
యంగనామణి గోరి సన్న్యాసి యయ్యె....

అదే విచిత్రం, వలచిన అంగనకోసమై సన్న్యసించాడు కాబట్టే అతని మోముపై మృదూర్ధ్వ పుండ్రం నిలిచింది. మృత్-ఊర్ధ్వ పుండ్రాన్ని విరక్తునికీ, మృదు ఊర్ధ్వపుండ్రాన్ని అనురక్తునికీ సహజమైన అలంకారాలుగా తీర్చిదిద్దిన కవి ఎంత చతురుడు!

రైవతకోత్సవానికి వచ్చిన దొంగ సన్న్యాసికి బలరాముడు నమస్కరించి....స్వాము లెందుం

డియిచటికి వచ్చినారు?....అని అడిగాడట; అమాయికంగా. స్వాములు అనే పదానికి తెలుగు పలుకుబడిలో స్ఫురించే హేళన పాపం బలరామునికి తెలియదు! అర్జునునికి తెలిసి ఓక్షణం మనస్సులో కలవరపడ్డా, పైకిమాత్రం గంభీరంగానే ఉన్నాడు. ఆక్షణంలో యీ యిద్దరి ముఖాలూ కలయజూచిన కృష్ణుని పెదవులపై విరిసిన ఆ పలచని లేతనవ్వు—ఆ సన్నివేశానికి ఎంత కోమలమైన వ్యాఖ్యానం చేస్తున్నది.

అరుగో, చిన్న మరదలి మోహంపు చిన్నెలెరిగి సుభద్రను పట్టుకుని పరాచికా లాడుతున్న అష్ట మహిషులు....

పులకించెనేమేమితలచుకొంటివె యంచు మేలంబువచరించె మిత్రవింద
ఇన్నాళ్ళవలె మనసిచ్చి మాటాడవే యందుద ష్టియని కాళింది తెగడె
చెలిపెండ్లి కతసెప్ప చెవియొగ్గి విన వేమి కలదులేయని గేలిసలిపె భద్ర
వలపువాసన మించె గలికి నీమొగ మంచు త్రిత్తరి నెరపెసుదంతకొంత
జాంబవతి నవ్వె. లక్షణసరసమాడె.
ఏ లగడుచేసెదరు ముద్దరాలిననుచు బరికె రుక్మిణి, సత్య కన్గిలిపె నపుడు....

పాపం ఏమీతోచక ఏ మాటారాక ఏదీ చెయ్యలేక—సిగ్గులప్రోవై, ముఖానికి చేతులడ్డం పెట్టుకుని కూర్చున్న సుభద్ర అదిగో. నిజానికి వదినెల పకపకలవల్ల బయట పడింది ఆ ముద్దరాలి గుట్టుమాత్రమేకాదు, వదినెల అంతర్యాలు కూడా....

వదినెలలో అందరూ ఒక యెత్తూ, రుక్మిణీ సత్యభామలు ఒక యెత్తూ. మిగిలిన ఆరుగురు వదినల్లో కొందరు సరసాలాడేవాళ్ళూ కొందరు పగలబడి నవ్వేవాళ్ళూ. యీ అల్లరిచూచి సుభద్రమీద జాలిపడింది ఒక్క రుక్మిణి మాత్రమే. చిరునవ్వు నవ్వుతూ 'ఎందుకే పాపం ఆ ముద్దరాలిని అలా అల్లరి పెడతారన్నదట ఆమె సవతులతో. వెంటనే అందుకుని ఇంకాఅల్లరిచెయ్యండన్నట్లు కన్నుగిలిపిందట సవతులకు గడసరి సత్య. ఎంత చిత్రమైన స్వభావాలు. సత్య అంతటితో ఊరుకోలేదు. సుభద్ర ఒడలంటిచూచి ...

త్రాగియున్నది మిగుల నంగంబు సూడ
గలవరించుచు నున్నది కలవొయేమొ
సోకు దల్ల సన్న్యాసికే చూపవలయు.

అనే టప్పటికి అందరూ గొల్లుమన్నారు. రసజ్ఞుల హృదయాలు జల్లుమనేట్లు....

విజయవిలాసంఅంతటా అడుగడుగునా చెవిసోకే సుకుమారమైన పదబంధం మరి ఏ కవిరసాధ్యం తెలుగులో? తేటతెనుగు పదాలతో ఇంత సున్నితమైన శ్లేషను పొదిగిన తెలుగుకవి మరి యెవడు? భావనలో, భాషలో ఇంత ఉద్వేగాన్ని నింపిన కవి ఏడీ తెలుగు సాహిత్యంలో? ఇంత కోమలమైన హాస్యాన్ని సన్నివేశంలో సంభాషణలో పోషించిన రససిద్ధుడు మరి ఏడీ? అందువల్లనే విజయవిలాసం అంతా పరవశుడై విని రఘునాథ భూపరసికాగ్రణి అన్నాడట....

'క్షితిలో నీ మార్గ మెవరికిన్ రాదుసుమీ'....అని, ఆనంద బాష్పాలు కురుస్తూ వెంకటకవితో ....నిజమే. క్షితిలో వేంకటకవి మార్గం ఎవరికీ రాలేదు, నాటికీ నేటికీ—



రేడియో సప్తాహ సందర్భంలో స్త్రీల ప్రత్యేక కార్యక్రమమునకు హాజరయిన ప్రేక్షకులలో ఆంధ్రప్రదేశ్ సమాచారమంత్రి శ్రీ పి వి. నరసింహరావు, శ్రీ డి.ఎన్. దీక్షిత్ (స్టేషన్‌డైరెక్టరు, హైదరాబాద్)



గంగూబాయ్ హంగల్
(ఇటీవల హైదరాబాద్ నుండి ప్రసారితము)

# నెహ్రూ ఇందిరకు వ్రాసిన లేఖలు

ఎం. సూర్యకాంత

ఈ శతాబ్దపు ప్రపంచ రాజకీయ వేత్తలలో నెహ్రూ ఒక విశిష్ట వ్యక్తి. గొప్ప మేధావి. శాంతిదూత. ఈయన రాజకీయ వేత్తయేకాదు- ఈయన విశిష్టత వైజ్ఞానిక, చారిత్రక తదితర శాస్త్రాలలో కూడ కనిపిస్తుంది. తన కుటుంబంలో ఈయన ఆదర్శ పుత్రుడు, భర్త, తండ్రి కూడాను. ఇంతేకాక, కర్మయోగి, కర్తవ్యపరాయణుడు. ఇవన్నీగాక ఈయన గొప్ప రచయిత. ఆంగ్ల భాషలో అనేక పుస్తకాలు వ్రాశాడు. ఈ రచనలుగాక, చిన్నపిల్లలకి సులభంగా అర్థమయే శైలిలో, యెంతో విజ్ఞానాన్ని, వికాసాన్ని సుమారు 30 ఉత్తరాలలో యిమిడ్చి, తన పదేళ్ళ కుమార్తె ఇందిరకు వ్రాశారు. ఈ ఉత్తరాలలోనుండి ఈయన శీలం స్వభావం ఉద్దేశ్యాలు తొంగి చూస్తూ ఉంటాయి.

ఈ ఉత్తరాలు వ్రాస్తూన్నప్పుడు ఇందిరకు పదేళ్లు. అవి స్వాతంత్ర్య పోరాటం ముమ్మరంగా జరుగుతున్న రోజులు. ఆ రోజుల్లో నెహ్రూని జైలుకు పంపడం ప్రభుత్వానికి పరిపాటి అయింది. కాని, అంత క్లిష్ట పరిస్థితులలో కూడ ఆయన ఆలోచనలన్నీ చిట్టి ఇందిరమీదే వుండేవి. ఇందిర ముస్సూరీ వెళ్ళింది....కూడా వున్నప్పుడు యేవేవోప్రశ్నలు వేస్తూ వుండేది. అన్నిటికీ ఓపికగా సమాధానాలు చెపుతూ వుండేవాడు. కాని ఇప్పుడు? ముస్సూరీలో ఏంచేస్తోందో? ఈమెకు ప్రశ్నల ద్వారా విషయాలు తెలుసుకోవడానికి ఎవరూ లేరుకదా! ఆమె ఇప్పుడు పెద్దదవుతూంది. ఈ సృష్టిలో వైచిత్రాలు, రాజ్యాంగ విషయాలు, మనుష్యుల వింత మానసిక ప్రవృత్తులు-వీటన్నిటి గురించి ఆలోచించే వయస్సు వచ్చింది. అందుచేత సమయం దొరికినప్పుడల్లా ఇందిరకి ఉత్తరాల రూపంలో విజ్ఞానాన్ని బోధించటానికి పూనుకున్నాడు. చక్కటి సరళ శైలిలో ఎంతో విజ్ఞానాన్ని ఈ ముప్పై ఉత్తరాలలోనూ యిమిడ్చారు.

## మానవ చరిత్ర

ఈ లేఖలలో అన్నిటికన్నా ముఖ్యంగా నెహ్రూ చారిత్రక దృక్పథం కనిపిస్తుంది. ఈయన జైల్లో వ్రాసిన ఉత్తరాలు,ఈయనస్వీయచరిత్రఅన్ని ఎక్కువ భాగము చరిత్రయే.కూతురికి పెద్దయాక వ్రాసిన ఉత్తరాలు Glimpses of World History ప్రచురింపబడ్డాయి. చిన్న యిందిరకి ఉత్తరాలలో సంఘాలనేవి అసలు ఎలా బయలుదేరి మెల్లిగా రాజ్యాంగాలుగా మారాయో చక్కగా విశదీకరించాడు. ఆయన ఏమంటాడో చూడండి—"సృష్టి మొదలయాక మానవులకి, ఇతర జంతువులవలె గాక తెలివితేటలు, సంఘీభావం పెరగ సాగాయి. ఒక సంఘమని ఆ సంఘానికి పెద్ద అని బయలుదేరాడు. ఈ సంఘ పెద్దని అందరూ గౌరవించేవారు. ఆయన సంఘంలోని వారందరికోసం పాటుబడి తగు సలహాలిస్తూ, సహాయమచేస్తూ వుండేవాడు. ఈ సంఘాలే పెద్దవై, చిన్న చిన్న రాజ్యాలుగా మారి, సంఘ పెద్దలు రాజులైనారు. ఈ రాజులే కొందరు తమ ధర్మము మరచి, కర్తవ్యము విస్మరించి అధికార గర్వంతో భోగ భాగ్య విలాసాలతో తూలుతూ వుండేవారు. ఈ విధంగా రాజులు రాజ్యాంగాలుబయలుదేరాయి''అని అంటాడు నెహ్రూ. ఇదియే గాక, నెహ్రూ ఉద్దేశ్యంలో ప్రతిమనిషికి, ప్రతి విద్యార్థికి చారిత్రక విజ్ఞానం చాలా అవసరం. ఈ విజ్ఞానంవలన మన పూర్వులయొక్క బుద్ధి కుశలత, గొప్పదనము, వాళ్లుచేసిన మంచి పనులు తెలుస్తాయి. అదీగాక, పూర్వపు రాజులు, వారి దేశాలలో క్లిష్ట సమస్యలు, చిక్కులు ధైర్యంతో యెలా యెదుర్కొన్నారో తెలిస్తే వారి అనుభవాలు మనము ఉపయోగించుకుందుకి వీలవుతుంది. అసలు మనము చిన్నచిన్న సమస్యలను పెద్దవి చేసుకొని అలాంటి కష్టాలు మన మొక్కళ్ళమే అనుభవిస్తున్నామని బాధపడుతూ ఉంటాము. చిన్నచిన్న విజయాలకి పొంగిపోతూ వుంటాము. పూర్వపు చారిత్రక విజ్ఞానముంటే, మన జీవితాలు, మన చర్యలు, మన సమస్యలు కాలప్రవాహం ముందెంత చిన్నవో మనకు తెలుస్తుంది. నెహ్రూ ఉద్దేశ్య ప్రకారం మన ప్రస్తుత చరిత్ర పుస్తకాలు సరియైన విజ్ఞానాన్ని పిల్లలకి అందజేయడం లేదు. చరిత్రంటే పూర్వపు రాజుల పేర్లు, వారు చేసిన యుద్ధాలు, వాటి తేదీలుకాదు, ఒక దేశంయొక్క మనుష్యుల గురించి, వారి సుఖదుఃఖాలు వారి దైనందిన జీవితం-వాళ్ళ కష్టాలను వారెలా ఎదుర్కొన్నారో-ఇదీ చరిత్ర.

## నాగరికత

ఈ ఉత్తరాలలో నెహ్రూ నాగరికతాభివృద్ధినిగురించిచక్కగావ్రాశారు ఆలోచనా శక్తి బయలుదేరడమే మానవునకు మిగతా సృష్టికిగల తేడా. ఈ సందర్భంలో నెహ్రూ ఒక చక్కటి దృష్టాంతం చెప్పాడు. పెద్ద ఏనుగుమీద చిన్నమనిషి కూర్చుని ఆ ఏనుగును అదుపులో పెట్టుకుంటాడు. తన ఆలోచనాశక్తి మూలంగానే ఆ పెద్ద బలమైన జంతువుకంటే తను అధికుడు. ఈ విషయమే అందరూ జ్ఞాపకం ఉంచుకో వలసి ఉంది. మనిషి తన ఆలోచనా శక్తిని ఉపయోగించుకో లేకపోతే అతడు జంతువులకన్న హీనుడు. ఈ శక్తితోనే మానవుడు సమస్త కళలు అభ్యసించాడు. సేద్యంచేసి పంటపండించి ఫలము ననుభవించడం నేర్చుకున్నాడు. ఈవిధంగా చిన్న సంఘాలు తరువాత పూళ్లు, దేశాలు పుట్టాయి. కాని, మనుష్యులు తాము చాలా గొప్పవారమని ఇతర దేశీయులు హీనులనే ద్వేషంతో ఎవరు గొప్పవారో తేల్చుకోవటానికి యుద్ధాలు ప్రారంభించారు. యుద్ధాలలో అనేక మంది చనిపోవడం తప్ప లాభమేమీ లేదనే సత్యాన్ని మనుష్యులు గ్రహించలేరనే విచారము ఇందిరకు వ్రాసిన రెండవ ఉత్తరంలో విదితమౌతుంది. కాని అప్పటికి యిప్పటికి

పరిస్థితి విషమించడమే తప్ప మానవులో కొంచమైనా నిజమైన వికాసం కలుగలేదు. మన పూర్వుల కంటే మనము చాల తెలివైన వారమని చాల విజ్ఞానవంతులమని మిడిసిపడడం మతిభ్రమ. ఈ సందర్భంలో నెహ్రూ ఇందిరకి ఏం చెప్తున్నారో వినండి–"ప్రాచీన కాలంలో పాశ్చాత్య దేశాలు వెనకబడియున్న శతాబ్దంలో భారత, చైనా, ఈజిప్టు దేశాలు నాగరికతాభివృద్ధి కలిగి వర్ధిల్లుచుండెడివి. ప్రస్తుతం బ్రిటిషు పరిపాలనలో మన దేశం బానిసదేశంగా ఉంది. మనం విశ్వప్రయత్నముచేసి, దేశ స్వాతంత్ర్యం సంపాదించి మళ్ళీ మన దేశాన్ని పూర్వపు ఔన్నత్యానికి తీసుకురావాలి" అన్నారు.

### ప్రకృతి పరిణామము

నెహ్రూ చాలా వైజ్ఞానిక దృక్పథం గలవాడు. ఆయన మొదటి ఉత్తరంలోనే ప్రకృతి చరిత్ర గురించి విశదపర్చి ఇందిరకి వ్రాశారు. భూమి యొక్క చరిత్రగూర్చి ఇలా వ్రాశారు. "భూమి కొన్నికోట్ల సంవత్సరముల ముందొక అగ్నిగుండము. అది చల్లబడి మెల్లిమెల్లిగా ప్రాణులు- మొదట ఆకులు చెట్లగాను తరువాత చేపల రూపంలోకి మారి, అనేక జంతువులు, కోతులు, కాలక్రమేణా మనుష్యులుగాను ఎలా పరిణామము చెందాయో విశదీకరించారు. ఈ పరిణామాలవల్ల ప్రకృతి ఏ విధంగా నిరంతరం సృష్టికి మెరుగు దిద్దుతోందో మనకు కనపడుతుంది.

ఈ విధంగా సృష్టియైన ఈ భూమిపైన మనుష్యులలో రంగు, భాష, తదితర భేదాలు నామమాత్రమే. మన భూమిపైన ఉన్న వివిధజాతులకిగల భేదాలు కేవలం దేహచ్ఛాయ, జుటు రంగు ఇలాంటివి మాత్రమే. జర్మనీ దేశపు మనిషి తెల్లగా వుండి, జుటు పొడుగ్గా ఉంటే, నీగ్రోజాతి మనిషి నల్లగా ఉండి, జుటు నల్లగా పొట్టిగా వుంగరాలు తిరిగి ఉంటుంది. అంతేగాక మనిషి రంగు ఆ దేశపు శీతోష్ణ పరిస్థితులపై ఆధారపడి ఉంటుంది. కాశ్మీర దేశంలో మనుష్యులు తెల్లగాను మద్రాస్‌లో నల్లగాను ఉండటం దీనికి ప్రబల నిదర్శనం. ఈ భేదాలు మర్చిపోవడం చాలా ముఖ్యమని నెహ్రూ ఉద్దేశ్యం. అదీగాక ప్రపంచంలో భాషలలో గూడ ఎంతో సన్నిహితత్వం ఉంది. ఇదంతా చూస్తే మానవులయొక్క స్వాతిశయము, స్వార్థము, జాతిద్వేషము ఎంత మూర్ఖత్వమో తెలుస్తుంది. నెహ్రూ వ్రాసిన పదవ ఉత్తరంలో ఈ మాటే కూతురుకు బోధించారు. ఆయన వ్రాసిన మాటలు...."మనం భారత దేశీయులం గాబట్టి భారత దేశం కోసం పాటుపడాలి. కాని మనం ప్రపంచ కుటుంబంలో ఒకళ్ళమని–ఇతర దేశ ప్రజలు మన బంధువులని మనము మరచిపోగూడదు. ప్రపంచంలో అంతా సంతోష సౌభాగ్యాలతోఉంటే అంతకంటె గర్వించతగ్గ విషయము మరొకటి లేదు. దీనికోసం కూడ మనము పాటుపడాలి." ఎంత ఉత్తేజకరమైన భావాలు! ఈ భావాలు ఈయన 1928-వ సంవత్సరంలో చిటి కూతురికి బోధించారు. ఈ ఆదర్శాల కోసమే ఈయన ఈ రోజుకూడా అంటే సుమారు 34 సంవత్సరాల తరువాత, విశ్వమానవ కల్యాణానికి పాటుపడుతున్నారు.

### మత స్వరూపము

నెహ్రూ మతం, దేవుడు వీటిని గురించి తన అభిప్రాయాలుకూడా ఇందిరకి ఉత్తరాల ద్వారా వ్యక్తం చేశాడు. అసలు దేవుడు పూజ పునస్కారాలు ఏ విధంగా ప్రారంభమయాయో ఆయన అభిప్రాయాలు యివి: మొదట్లో మానవులు పంటలు పండించడం ప్రారంభించినప్పుడు వర్షం లేకపోతే అవస్థపడిపోయేవారు. అజ్ఞానంవల్ల, భయంవల్ల, దేవతలని సృష్టించుకుని, వాళ్ళకి భయపడడం మొదలుపెట్టేరు, ఆ దేవతల కొరకు దేవాలయాలు, దేవాలయాలు నడిపించేందుకు మతాధికారులు వివిధ దేశాలలో అనేక విధాలుగా మతాలనే పేరుతో వచ్చాయి." నెహ్రూ ఉద్దేశంలో దేవుడంటే ఈ ప్రకృతిని నడిపించే శక్తి. ఈ శక్తి నిర్గుణము, నిరాకారము. మనం దేవుణ్ణి ఆ విధంగానే ధ్యానించాలి. అది చేయలేనివారు విగ్రహాన్ని ఆ శక్తి స్వరూపంగా ఆరాధించవచ్చు. కాని, దేవుడంటే భయం, ఆ దేవుణ్ణి సంతోషపెటడానికి ప్రయత్నించడం కేవలం అజ్ఞానం. అలా అని నెహ్రూకి పాత సంప్రదాయం, ఇతిహాస పురాణముల యందు అగౌరమని అనుకోవడం పొరపాటు. ఆఖరి లేఖలో వేదకాలంనాటి యోగులు, మహర్షులు వారు వ్రాసిన వేదాలు, పురాణాలంటే చాలా భక్తిగౌరవాలు వ్యక్తపరిచాడు. ఆయన వ్రాసిన ఆఖరి ఉత్తరంలో యిలా వుంది: "ఈ గొప్ప గ్రంథాలు మహానుభావులు తప్ప ఎవరు వ్రాయగలరు? ఇంతకాలం క్రిందట వ్రాసిన ఈ గ్రంథాలయొక్క ప్రభావం ప్రతి భారతీయునిమీద కనిపిస్తుంది."

ఈ విధంగా ఈ లేఖలో ఎంతో విజ్ఞానాన్ని, తన వ్యక్తిత్వాన్ని ఇందిరకి అందజేశాడు. ఈ లేఖలు పుస్తక రూపంలో ప్రచురింపబడ్డాయి. వీటిని చదివి ఈ భావాల్ని, వికాసాన్ని, పిల్లలకి అందజేయవలసిన బాధ్యత అందరిమీద వుంది.



ఎమ్. చిత్తరంజన్, ఎస్. విజయలక్ష్మి: లలిత సంగీతము
(ఇటీవల హైదరాబాద్ నుండి ప్రసారితము)



"ఊరిచావిడద్ద"
(ఇటీవల హైదరాబాద్ నుండి ప్రసారితము)

# ప్రసార విశేషాలు

## చిత్రరువు

నాటిక

రచన: జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి

కర్ణాట దేశంలో విజయమాలి గొప్ప వర్తకుడు. మలయమాలి యీ యన పుత్రుడు. ఈ మలయమాలి ఒకనాడు తండ్రితో రాజకులానికి వెళ్ళాడు. అక్కడ 'ఇందుయశ'—రాజపుత్రిని చూచాడు. ఆమెను వరించి, ఆమెను ధ్యానించడం ప్రారంభించాడు. నిద్రాహారాలు లేవు. మాటలులేవు. పిచ్చివాడయ్యాడు. మందర కుడు రాజపుత్రరహస్యాన్ని తెలుసుకొని అతనికి సంతృప్తి కల్గిద్దామని ఆమె చిత్రాన్ని చిత్రించి ఇస్తాడు. ఈ చిత్రరువు రాజపుత్రిక—చిత్తరువుకాదు. మనిషేనని మలయమాలి భావన. ఆ చిత్రమే లోకంగా ధ్యానపారమితాన్ని పొందుతాడు.

ఒకనాడు, తోటలోకి వెన్నెలవిహారం వెళ్ళాడు. ఈ మోహం ముదిరి వీడు ఎందుకూకాకుండా పోతున్నాడని తండ్రి గోల।

వినయజ్యోతి

ఒక ముని, మలయమాలిని చూచి యితన్ని దారికి మళ్ళిద్దాం అని వచ్చాడు.

ఓ చెట్టుకు చిత్రపటాన్ని వుంచి పువ్వులు కోసుకురావాలని వెళ్ళాడు— మలయామాలి.

ఈస్థితిలో వినయజ్యోతివచ్చి ఆపటంలో ఒక కృష్ణ సర్పాన్ని చిత్రించి పక్కన దాగున్నాడు. పాము కరిచి ప్రియురాలు చనిపోయిందని భావించి మలయమాలి మరణోన్ముఖుడవుతాడు. కిందపడతాడు.

వినయజ్యోతి వచ్చి ఏడుస్తూన్న అతన్ని పట్టుకుని—ఇందుయశ, రాజకుమారిలో సుఖంగా ఉన్నదని, ఇది పటమనీ నచ్చచెప్పి వెళ్ళిపోతాడు.

చిత్తరువు—నాటికను మే మాసం 7 వ తేదీ సోమవారం రాత్రి 9-15 కి వినగలరు.

## మద్రాస్ షార్ట్‌వేవ్ ప్రసారాలు

| | | |
|---|---|---|
| ఉదయం | 49.30 మీ | (6085 కిలోసై) |
| మధ్యాహ్నం | 41.32 మీ | (7260 కిలోసై) |
| సాయంత్రం | 60.98 మీ | (4920 కిలోసై) |

పైన ప్రచురించిన షార్ట్‌వేవ్ మీటర్లలో ఉదయం 7-00 నుండి 7-15 వరకు, మ॥ 1-50 నుండి 2-00 వరకు, సాయంత్రం 7-00 నుండి 7-15 వరకు, రాత్రి 9-30 నుండి 10-30 వరకు మద్రాస్(ఎ) కార్యక్రమాలు ప్రసారమౌతాయి.

సోమవారములు రాత్రి 9-15 గంటలనుండీ, బుధవారములు రాత్రి 7-45 నుండి 9-30 వరకూ పై మీటర్లలో మద్రాస్ (ఎ) కార్యక్రమాలను వినవచ్చును. తక్కిన సమయాలలో పై షార్ట్‌వేవ్ మీటర్లలో మద్రాస్ (బి) కార్యక్రమాలు ప్రసారమౌతాయి.

మే 5-వ తేదీనుండి ఈ క్రింది మీటర్లు అమలులోనికి వచ్చును :

| | | |
|---|---|---|
| ఉదయం | 60•98 మీ | (4920 కిలోసై) |
| మధ్యాహ్నం | 49•30 మీ | (6054 కిలోసై) |
| సాయంత్రం | 60•98 మీ | (4920 కిలోసై) |

## 'రామచంద్ర విజయం'

కీ॥ శే॥ చిలకమర్తి లక్ష్మీనరసింహం గారి 'రామచంద్ర విజయం' నవల ఆధారంగా రచించబడిన నాటకము. దీనిని కొండముది హనుమంతరావు రచించారు.

పాల్గొనువారు: ఎమ్. నాగరత్నమ్మ పి. సీతారత్నమ్మ, లత, ఎమ్. జి. శ్యామల, పి. రామచంద్ర కాశ్యప్, కర్నాటి లక్ష్మీనరసయ్య, బందా, మాచినేని వెంకటేశ్వరరావు, ఉప్పులూరి రాజారావు, కొడాలి చంద్రమౌళీశ్వర రావు, సి. రామమోహనరావు, కూచిమంచి కుటుంబరావు, ఎ. వై. మన్నార్ నండూరి సుబ్బారావు.

నిర్వహణ: బందా కనకలింగేశ్వర రావు.

ఈ నాటిక విజయవాడ కేంద్రంనుండి మే 6 ఆదివారం మధ్యాహ్నం 3-00 గంటలకు ప్రసారమౌతుంది.

## పోస్టాఫీస్

మూలం: విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్

రేడియో అనుసరణ: విద్వాన్ విశ్వం

పాల్గొనువారు:

అమల్—పి. రామస్వామి చౌదరి
సుధ—పి. వి. రాజ్యలక్ష్మి
మల్లిక—పి. కామాక్షి
వైద్యుడు—ఎ. లింగరాజశర్మ
గఫర్—ఎన్.వి.ఆర్. సాంబశివరావు
పెరుగువాడు—నండూరి సుబ్బారావు
గస్తీవాడు—సి. రామమోహనరావు
కంచుకి—సి. శ్రీరామచంద్రమూర్తి
ఆస్థానవైద్యుడు—కె. బావయ్య
మాధవుడు—కందుకూరు చిరంజీవిరావు
తలారి—ఎన్. పి. విఠల్

నిర్వహణ: సి. రామమోహనరావు

ఈ నాటిక మే 8 మంగళవారంరాత్రి 7-45 గంటలకు విజయవాడ కేంద్రము నుండి ప్రసారమౌతుంది.

## ఇల్లు కట్టిచూడు

నాటిక

రచన: శ్రీరామ్‌చంద్

రామయ్యగారు మధ్యతరగతికి చెందినవాడు. మధ్య తరగతికి చెందిన చాలా మంది వలెనే ఆయనా తన జీవితాన్ని గుమాస్తా గిరితో ప్రారంభించాడు. ఉండీ లేనట్లు, లేకా ఉన్నట్లు బతుకుతూ హెడ్ గుమాస్తా అయ్యాడు. నేడోరేపో రిటైర్ అవడానికి సిద్ధంగా ఉన్నాడు. ఆయనకీ ముగ్గురు సంతానం. పెద్దవాడు గణపతి బి.ఎ. పాసయ్యాడు. కూతురు శాంత పెళ్ళీడు కొచ్చింది. చిన్నకొడుకు స్కూలు ఫైనలులోకి వచ్చాడు.

రామయ్యగారి జీవితమంతా అద్దె కొంపల్లోనే గడిచింది. 'ఏమైనా మనదనేది. ఓ యిల్లుండాలండి' అంటుంది ఆయనభార్య పిల్లలుకూడా అదే ఉద్దేశంలో ఉన్నారు. ఇహ రామయ్యగారి సంగతి చెప్పాలా, ఆయనఉద్యోగంలో ప్రవేశించిన నాటనుండీ ఇల్లు కట్టాలనే అనుకుంటున్నాడు. చివరి కేపైతేనేం ఇల్లు కట్టించడానికి నిర్ణయించాడు. కాని భార్య పిల్లలు ఒక పాకాన తెగవిస్తేగా రోజుకోవిధంగా ఇంటిప్లాను మారిపోతూ ఉన్నది. ఇలా లాభంలేదని కుటుంబమంతా సమావేశమై ఇంటిప్లాను తుది మెరుగులు దిద్దటానికి నిర్ణయించారు. ఇంత రభస జరిగినతర్వాత వారుకట్టేది ఉత్తగాలి మేడేనా।

ఇల్లుకట్టిచూడు—నాటికను ఏప్రిల్ మాసం 30వ తేదీ సోమవారం రాత్రి 9-15 గంటలకు మద్రాసు కేంద్రంనుండి వినగలరు.

◇◇◇◇◇◇◇◇◇◇◇◇◇◇◇◇◇◇◇◇

## మంగళవారం మే 1

శక 1884 వైశాఖ 11

◇◇◇◇◇◇◇◇◇◇◇◇◇◇◇◇◇◇◇◇

## మద్రాస్-ఎ

ప్రసారము I

416·7 మీ (720 కిలోసై)

6-45 మంగళగానం
6-50 తుదిప్పాడల్గళ్
7-00 వాద్యగోష్ఠి•
7-10 నేటికార్యక్రమ వివరణ, వాతావరణసూచన (తమిళము)•
7-15 తమిళమున వార్తలు
7-30* కుంద్రక్కుడి ఎన్. శారద: వయొలిన్
8-00 మధురగీతం†
8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారం II

416·7 మీ (720 కిలోసై)

1-00* కదంబం†
1-15 వాద్యగోష్ఠి
1-30 గానమంజరి†
1-40 హిందీలో వార్తలు
1-50 గీతమంజరి†•
2-00 తమిళమున వార్తలు
2-10 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారం III

416·7 మీ (720 కిలోసై)

5-30* పాల్ఘాట్ వి. ఎ. సుందరం
6-05 ప్రాంతీయ శెయిదిగళ్
6-15 గ్రామస్థులకు (తమిళము) (తిరుచ్చినుండి రిలే)
(7-00 నుండి 7-15 వరకు షార్ట్‌వేవ్‌పైగూడా)
7-15 తమిళమున వార్తలు
7-30* చిత్రగానం†
7-45 తిరుచ్చివలె
9-00 సంగీతమాల†
9-35 హిందీలో కార్యక్రమము
9-40 తిరుచ్చివలె
9-50 ఇత్తై ఏడు
సంగీత మాగజైన్ కార్యక్రమం
సమర్పణ: సంధ్యావందనం శ్రీనివాసరావు
10-30 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

## మద్రాస్-బి

ఉ॥ ప్రసారం I

211·3 మీ (1420 కిలోసై)
49·30 మీ (6085 కిలోసై)

6-45 మద్రాస్ ఎ వలె
7-00 తెలుగులో వార్తలు**
7-15 సంగీతమంజరి †
7-30 మద్రాస్ ఎ వలె
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారం II

211·3 మీ (1420 కిలోసై)
41.32 మీ (7260 కిలోసై)

12-00* కార్మికుల కార్యక్రమం (తమిళము) (తిరుచ్చినుండి రిలే)
12-30 ప్రసార సమాప్తి

ప్రసారం II (తరువాయి)

1-00 మద్రాస్ ఎ వలె
1-30 ఆంగ్లమున వార్తలు
1-40 గీతమంజరి †
1-50 తెలుగులో వార్తలు**
2-00 మధురగీతం†
2-10 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారం III

211·3 మీ (1420 కిలోసై)
60·98 మీ (4920 కిలోసై)

5-30* పాశ్చాత్య సంగీతం
5-50 స్థానిక ప్రకటనలు, వాణిజ్యవార్తలు (ఆంగ్లం)
6-00 ఆంగ్లమున వార్తలు
6-05 మద్రాస్ ఎ వలె
6-15 కార్యక్రమ వివరణ (తమిళము)

## విజయవాడ

357·1 మీ (840 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-30* శుభోదయం
6-35 భక్తిరంజని
6-55 ప్రసారవిశేషాలు
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీతశిక్షణ
7-30 కవిరాయని జోగారావు: వీణ
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారం II

12-30* కార్మికుల కార్యక్రమం (హైదరాబాద్‌నుండి రిలే)

---

6-20 వి. గీత
7-00 తెలుగులో వార్తలు**
7-15 గోటువాద్యం: నిలయవిద్వాంసుడు
7-30 ప్రసంగము (తమిళము) (తిరుచ్చినుండి రిలే)
7-45 మద్రాస్ ఎ వలె
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 కాల్ మణి నేరం
నాటిక (తమిళము)
రచన: ఉమాచంద్రన్
9-30 The Cherry Orchard
Play by Chekhov
presented by
Madras Players‡
10-30 ప్రసార సమాప్తి

## మద్రాస్-సి

193·5 మీ (1550 కిలోసై)

వివిధభారతి (రిలే)

(వివరాలు 56 వ పేజీలో)

•షార్ట్‌వేవ్‌పైగూడ వినవచ్చును.
**మీడియంవేవ్‌పై మాత్రం

1-00 పేరంటం స్త్రీలకు
మీరుకోరిన పాట
గృహలక్ష్మి-గృహాలంకరణ
ప్రి. సంగం
శ్రోతల ఉత్తరాలు
మంగళం
1-30 లలిత సంగీతం|
1-50 తెలుగులో వార్తలు
2-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారం III

6-00* స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 సాహిత్యనందిని (హైదరాబాద్‌నుండి రిలే)
6-30 గ్రామస్థుల కార్యక్రమం
ఫిల్మ్‌గీతం †
విశేషాలేమిటి?
చేయంగల విన్నపాలు
ప్రకటనలు, ధరలు, వాతావరణము
7-00 తెలుగులో వార్తలు
7-15 గ్రామస్థుల రేడియోగోష్ఠి
ప్రత్యుత్తరవేదిక
నిర్ణయనివేదిక
కోళ్ళ పరిశ్రమ
వసతి సౌకర్యాలు సంభాషణ
ఆహారానికి పనికివచ్చే కోళ్లు సంభాషణ
7-45 రేడియో వార్తావాహిని (హైదరాబాద్‌నుండి రిలే)
8-00 కవిరాయని జోగారావు: వీణ
8-30 ఉభయకుశలోపరి-శ్రోతల ఉత్తరాలకు జవాబులు
8-45 ఫిల్మ్ సంగీతం†
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 శెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్†
9-30 హరికథ
అలవర్తి బేబీ సుశీలారాణి
10-30* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

---



* సమయసూచన † గ్రామఫోన్ రికార్డు ‡ టేపురికార్డింగ్

మంగళవారం మే 1

## హైదరాబాద్-ఎ

105.4 మీ (740 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-30* సుప్రభాత్
6-35 భక్తిరంజని (విజయవాడనుండి రిలే)
6-55 కార్యక్రమవివరణ
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీతశిక్షణ (విజయవాడనుండి రిలే)
7-30 విజయవాడవలె
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30 ఎస్. బి. దేశ్‌పాండే: ఖయాల్
8-45* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-30* కార్మికుల కార్యక్రమం
కోటి విద్యలు
హాస్యరచన: కోట వెంకటరామయ్య
వింతలు-విశేషాలు
సినీగీత†
1-00 అమర్ జహాన్: ఘజల్
1-15 ఎస్. బి. దేశ్‌పాండే: ఖయాల్
1-30 వాద్యగోష్ఠి: విలయవిద్వాంసులు
1-50 తెలుగులో వార్తలు
2-00 హైదరాబాద్ బి వలె
2-10 ఉర్దూలో వార్తలు
2-20 హైదరాబాద్ బి వలె
2-30* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

6-00* స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 సాహిత్యనందిని
పేదబ్రతుకు కథానిక
రచన: ఇసుకపల్లి దక్షిణామూర్తి
6-30 నగరవాణి
సువర్ణ ద్వారం సంగీత రూపకం
రచన: స్మృతిశ్రీ
7-00 తెలుగులో వార్తలు
7-15 కన్నడ శ్రోతలకు
7-30 సుగం సంగీత్
7-45 రేడియో వార్తావాహిని
8-00 ప్రసంగము (ఉర్దూ)
8-10 విరామసంగీతం
8-15 శ్రోతల ఉత్తరాలకు జవాబులు
8-25 విరామ సంగీతం†
8-30 డి. శేషగిరిరావు: వయొలిన్
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 ఉర్దూలో వార్తలు
9-30 నూర్జహాన్ బేగం; తుమ్రీ, దాద్రా
9-45 శంకర్‌రావ్: సితార్
10-00 ఎస్. బి. దేశ్‌పాండే: ఖయాల్
10-30* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

## హైదరాబాద్ బి

ఉ॥ ప్రసారము I

60.12 మీ (4990 కిలోసై)

6-30* హైదరాబాద్ ఎ వలె
7-45 ప్రసార సమాప్తి

ప్రసారము I (తరువాయి)

42.02 మీ (7140 కిలోసై)

8-00 హైదరాబాద్ ఎ వలె
8-45* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

42.02 మీ (7140 కిలోసై)

12-30 హైదరాబాద్ ఎ వలె
2-00 డి. శేషగిరిరావు: వయొలిన్
2-30* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

60.12 మీ (4990 కిలోసై)

6-00* హైదరాబాద్ ఎ వలె
6-30 గ్రామస్థుల కార్యక్రమం
7-00 తెలుగులో వార్తలు
7-15 గ్రామస్థుల రేడియోగోష్ఠి
7-45 హైదరాబాద్ ఎ వలె
8-00 లయవిన్యాసం: చిత్తూర్ సుబ్రహ్మణ్య పిళ్ళై బృందం
8-15 హైదరాబాద్ ఎ వలె
9-15 శాస్త్రీయ సంగీతం †
9-30 హరికథ (విజయవాడనుండి రిలే)
10-30* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

## బెంగుళూర్

491.8 మీ (610 కిలోసై)

ఉ॥ ప్రసారము I

7-00* సుప్రభాత
కార్యక్రమ వివరణ
స్తోత్రమాల
7-15 సంగీత కచేరీ
7-15 కన్నడమున వార్తలు
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 హిందీశిక్షణ
8-30 బజారు ధరలు
8-35 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-00* ఎ. వి. వెంకటరామయ్య: వయొలిన్
12-30 వనితావిహార
1-10 కన్నడమున వార్తలు
1-20 కన్నడ గీతాలు
1-30 ఆంగ్లమున వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 కన్నడ గీతాలు
2-00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

6-00 ఆంగ్లమున వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-10 కన్నడ గీతాలు
6-20 గీతాంజలి
6-35 ప్రదేశసమాచార
6-45 గ్రామస్థులకు
7-45 కన్నడమున వార్తలు
8-00 సాహిత్య సాంస్కృతిక కార్యక్రమము (తమిళము)
8-30 అఖిలభారత రూపక కార్యక్రమము
ది ప్లీల్స్ ఆఫ్ ప్రొగ్రెస్‌కు కన్నడము
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 పుస్తకావలోకన సమీక్ష త్రివిక్రమ
9-25 వయొలిన్†
9-30 శాస్త్రీయ సంగీతము
10-30* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

## తిరుచ్చి

319.1 మీ (940 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-45* మంగళగానం
6-50 భక్తిగీతాలు
7-00 వాద్య సంగీతం
7-10 కార్యక్రమవివరణ
7-15 తమిళమున వార్తలు
7-30 రామనాథపురం అలమేలూ తిరుమలై
7-55 స్థానిక ప్రకటనలు (ఆంగ్లం)
8-00 ఆంగ్లమున వార్తలు
8-15* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-00* కార్మికులకు
12-30* ప్రసార సమాప్తి

ప్రసారము III

1-00* కదంబం†
1-40 హిందీలో వార్తలు
1-50 వాద్య సంగీతం†
2-00 తమిళమున వార్తలు
2-10 రామనాథపురం అలమేలూ తిరుమలై
2-45* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

4-45* వివిధభారతి
5-45 సంగీతపాఠం
6-00 స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 గ్రామస్థులకు
7-15 తమిళమున వార్తలు
7-30 మలరుం వాడ్కై; మహిళ ఉలా
ప్రసంగము (తమిళము) వి. సంతానం
7-45 మయూరం ఎస్. రాజం §
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 మద్రాస్ బి వలె
9-30 జానపద గేయాలు
9-50 ఇదై ఏడు
సంగీత మాగజైన్ కార్యక్రమం (మద్రాస్ నుండి రిలే)
10-30* ప్రసార సమాప్తి

## బుధవారం మే 2

శక 1884 వైశాఖ 12

## మద్రాస్-ఏ

**ప్రసారము I**

416·7 మీ (720 కిలోసై)

6-15 మంగళగానం
6-50 తుదిప్పాడల్‌గళ్
7-00 వాద్య సంగీతం•
7-10 నేటికార్యక్రమ వివరణ, వాతావరణ సూచన (తమిళము)•
7-15 తమిళంలో వార్తలు
7-30* కె. వి. నారాయణస్వామి‡
8-00 మధురగీతం†
8-15 ప్రసార సమాప్తి

**మ॥ ప్రసారము II**

416·7 మీ (720 కిలోసై)

1-00* పెణ్ణులగం స్త్రీలకు (తమిళము) (తిరుచ్చినుండి రిలే)
1-30 గానమంజరి †
1-40 హిందీలో వార్తలు
1-50 గీతమంజరి †•
2-00 తమిళంలో వార్తలు
2-10 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

**॥ ప్రసారము III**

416·7 మీ (720 కిలోసై)

?-30* శకుంతలా శ్రీనివాసన్: వీణ
6-05 ప్రాంతీయ శెయిదిగళ్
6-15 గ్రామస్థులకు (తమిళము) (తిరుచ్చినుండి రిలే)
(7-00 నుండి 7-15 వరకు షార్ట్‌వేవ్‌పై గూడా)
7-15 తమిళంలో వార్తలు
?-30* కేళ్విఅరంగం ప్రశ్నోత్తర కార్యక్రమం (తమిళం)
7-45 నగర మార్కెట్ రూపకము (తమిళము) (తిరుచ్చినుండి రిలే)
8-00 నాగర్‌కోయిల్ ఎస్. గణేశన్
8-30 మైథిలీ నాగేశ్వరన్
9-00 భక్తి సంగీతం: పి. ఎ. ఎస్. రాజశేఖరన్
9-30 ఇత్తైకోలం: ఎస్. రాజేశ్వరరావు
9-45 పి. కె. మదురై; నాదస్వరం
10-30 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

## మద్రాస్ - బి

**ఉ॥ ప్రసారము I**

211·3 మీ (1420 కిలోసై)
49 30 మీ (6085 కిలోసై)

6-45 మద్రాస్ ఎ వలె
7-00 తెలుగులో వార్తలు**
7-15 వాద్యగోష్ఠి
7-30 మద్రాస్ ఎ వలె
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 ప్రసార సమాప్తి

**మ॥ ప్రసారము II**

211·3 మీ (1420 కిలోసై)
41·32 మీ (7260 కిలోసై)

12-00* కార్మికుల కార్యక్రమం (తమిళము)
12-30 ప్రసార సమాప్తి

**ప్రసారము II (తరువాయి)**

1-00 కదంబం†
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 గీతమంజరి†
1-50 తెలుగులో వార్తలు**
2-00 మధురగీతం†
2-10 ప్రసార సమాప్తి

**సా॥ ప్రసారము III**

211·3 మీ (1420 కిలోసై)
60·98 మీ (4920 కిలోసై)

5-30* పాశ్చాత్య సంగీతం †
5-50 స్థానిక ప్రకటనలు, వాణిజ్యవార్తలు (ఆంగ్లం)
6-00 ఆంగ్లమున వార్తలు
6-05 మద్రాస్ ఎ వలె
6-15 కార్యక్రమ వివరణ (తమిళము)
6-20 కదంబం†

## విజయవాడ

357·1 మీ (840 కిలోసై)

**ఉ॥ ప్రసారము I**

6-30* శుభోదయం
6-35 భక్తిరంజని (హైదరాబాద్‌నుండి రిలే)
6-55 ప్రసార విశేషాలు
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీత శిక్షణ
7-30 హైదరాబాద్ వలె
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30 ప్రసార సమాప్తి

**మ॥ ప్రసారము II**

12-30* కార్మికుల కార్యక్రమం
నూతన పరిశ్రమ-మూలధనము ప్రసంగము
అర్జునుడు-రంగస్థ పాత్ర
విజ్ఞానవికాసాలు
1-00 మహిళా సమాజం (హైదరాబాద్‌నుండి రిలే)
1-30 ఎన్. పద్మ, సి. వి. కౌసల్య
1-50 తెలుగులో వార్తలు
2-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

**సా॥ ప్రసారము III**

6-00* స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 గ్రామస్థుల కార్యక్రమం
చిక్కుడోలు భీమయ్య పాట
లాభసాటి పంటలు-లక్క ఉపయోగాలు
ఫిల్మ్ గీతము†
మర్రిచెట్టుక్రింద: లోకాభి రామాయణము
నీటి పారుదల-అభివృద్ధి ప్రసంగము
ప్రకటనలు, ధరలు. వాతావరణము
7-00 తెలుగులో వార్తలు
7-15 గ్రామస్థుల కార్యక్రమం
ఫిల్మ్ సంగీతం†
విశేషాలేమిటి
చేయంగల విన్నపాలు
7-30 డాక్యుమెంటరీ చిత్ర సమీక్ష
7-40 విరామ సంగీతం†
7-45 లలితసంగీతం: ప్రఖ్య ఆంజనేయశాస్త్రి
8-00 మనమంతా ఒకటే నాటిక రచన; వేదుల లక్ష్మణమూర్తి
8-30 ఆకాశవాణి వాద్యబృందము
8-45 సన్నిహిత సంగీత సంప్రదాయాలు
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 లలిత సంగీతం: ప్రఖ్య ఆంజనేయశాస్త్రి
9-30 Third Five-year Plan talk (relay from Delhi)
9-45 ఎన్. పద్మ, సి. వి. కౌసల్య
10-30* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

---

7-00 తెలుగులో వార్తలు**
7-15 బృందగానం†
7-30 సంగీతమాల†
7-45 చారిత్రక సాహిత్యము: క్రీడాభి రామము** ప్రసంగం ఎన్. వెంకటరావు
8-00 మనమంతా ఒకటే** నాటిక (విజయవాడనుండి రిలే)
8-30 మద్రాస్ ఎ వలె
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 This week in Madras
9-25 వాద్య సంగీతం
9-30 Third Five-year Plan talk (relay from Delhi)
9-45 పాశ్చాత్య సంగీతం†**
10-30 ప్రసార సమాప్తి

## మద్రాస్-సి

193.5 మీ (1550 కిలోసై)
వివిధభారతి (రిలే)
(వివరాలు 56-వ పేజీలో)

• షార్ట్‌వేవ్‌పై గూడా
**మీడియంవేవ్‌పై మాత్రం



* [illegible]   † గ్రామఫోన్ రికార్డు   ‡ మాతియో రికార్డింగ్

మంగళవారం మే 15

## హైదరాబాద్-ఎ

ప్రసారము I

105.4 మీ (740 కిలోసైకిల్స్)

6-30* సుప్రభాత్
6-35 భక్తిరంజని (విజయవాడనుండి రిలే)
6-55 కార్యక్రమవివరణ
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీతశిక్షణ
7-30 విజయవాడవలె
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30 రైసాబేగం: ఖయాల్ తోడి
8-45 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-30* కార్మికుల కార్యక్రమం
1-00 మొహమ్మద్ అజీంఉద్దీన్: ఘజల్
1-15 రైసాబేగం: ఖయాల్ బృందావనీసారంగ్
1-30 ఈద్-ఉల్-జుహా ప్రసంగము (తెలుగు) (విజయవాడనుండి రిలే)
1-45 విరామ సంగీతము
1-50 తెలుగులో వార్తలు
2-00 హైదరాబాద్ బి వలె
2-10 ఉర్దూలో వార్తలు
2-20 హైదరాబాద్ బి వలె
2-30* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

6-00* స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయవార్తలు
6-15 సాహిత్యనందని
గాజులబత్తుడు తూలికాచిత్రం
మునిపల్లి సరోజనీదేవి
6-30 నగరవాణి
ఫిల్మ్ ఎలాతీస్తారు:
బి. కృష్ణరాజుతో పరిచయం
లలిత్ సంగీత్
7-00 తెలుగులో వార్తలు
7-15 కన్నడ శ్రోతలకు
7-30 సుగమ్ సంగీత్
7-45 రేడియో వార్తావాహిని
8-00 ఈద్-ఇ-అజా ప్రసంగం (ఉర్దూ)
డా॥ గులాం దస్తగీర్ రషీద్
8-10 విరామ సంగీతం
8-15 శ్రోతల ఉత్తరాలకు జవాబులు
8-45 విరామసంగీతం

8-30 వాద్యత్రయి
వి. సరస్వతి: వీణ
షేక్ హుస్సేన్ సాహెబ్: క్లారినెట్
ఎన్. ఎస్. శ్రీనివాసన్: వేణువు
పుప్పా సుబ్బారావు: మృదంగం
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 ఉర్దూలో వార్తలు
9-30 సుబద్ధ సంగీత్
9-55 షేక్ దావూద్: తబ్లా
10-10 రైసాబేగం: ఖయాల్ కేదార్
10-30* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

## హైదరాబాద్-బి

ఉ॥ ప్రసారము I

60·12 మీ (4990 కిలోసైకిల్స్)

6-30* హైదరాబాద్ ఎ వలె
7-45 ప్రసార సమాప్తి

ప్రసారము I (తరువాయి)

49.02 మీ (6120 కిలోసైకిల్స్)

8-00 హైదరాబాద్ ఎ వలె
8-45 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

42 02 మీ (7140 కిలోసైకిల్స్)

12-30* హైదరాబాద్ ఎ వలె
2-00 కె. శాంత
2-30* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

60 12 మీ (4990 కిలోసైకిల్స్)

6-00* హైదరాబాద్ ఎ వలె
6-30 గ్రామస్థుల కార్యక్రమం
ఫిల్మ్‌గీతము†
విశేషాలేమిటి
చేయంగల విన్నపాలు
7-00 తెలుగులో వార్తలు
7-15 గ్రామస్థుల కార్యక్రమం
7-45 హైదరాబాద్ ఎ వలె
8-00 లయచిత్రం: రూపకతాళం
8-15 హైదరాబాద్ ఎ వలె
9-15 కె. శాంత
9-30 గరుడాచల యక్షగానం
సంగీత రూపకము
రచన: యాదవదాసు
నిర్వహణ: యు. కృష్ణమూర్తి
10-30* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

## బెంగుళూరు

491 8 మీ (610 కిలోసైకిల్స్)

ఉ॥ ప్రసారము I

7-00* సుప్రభాత
కార్యక్రమ వివరణ
స్తోత్రమాల
7-15 హెచ్. రామచంద్రరావు
7-45 కన్నడమున వార్తలు
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 హిందీశిక్షణ
8-30 బజారు ధరలు
8-35 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-00* సంగీత కచేరీ
12-30 వనితా విహార
1-10 కన్నడమున వార్తలు
1-20 సి. విశ్వనాథ్: కన్నడ గీతాలు
1-30 ఆంగ్లమున వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 సి. విశ్వనాథ్: కన్నడ గీతాలు
2-00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

6-00 ఆంగ్లమున వార్తలు
6 05 ప్రాంతీయ వార్తలు
6 10 సి. విశ్వనాథ్: కన్నడగీతాలు
6-20 గీతాంజలి
6-35 ప్రదేశసమాచార
6 45 గ్రామస్థులకు
7-45 కన్నడమున వార్తలు
8-00 తరంగరంగ
హాస్య కదంబం (కన్నడం)
8-30 ఈద్-ఉల్-జుహా
కన్నడ ఉదాహరణలతో ప్రసంగం
సైయద్ ఖాదిర్ మొహియుద్దీన్
8-45 వనమాల దేశ్‌పాండే: కన్నడ పాటలు
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 డాక్యుమెంటరీ చిత్రసమీక్ష
9-25 వేణువు†
9-30 గంగూబాయీ హంగల్: హిందూస్థానీ గాత్ర సంగీతం
10-30* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

## తిరుచ్చి

319 1 మీ (940 కిలోసైకిల్స్)

ఉ॥ ప్రసారము I

6-45* మంగళగానం
6-50 భక్తిగీతాలు
7-00 వాద్య సంగీతం
7-10 కార్యక్రమ వివరణ
7-15 తమిళమున వార్తలు
7-30 టి. కె. లక్ష్మణన్
7-55 స్థానిక ప్రకటనలు (ఆంగ్లం)
8-00 ఆంగ్లమున వార్తలు
8-15* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-00* కార్మికులకు
12-30* ప్రసార సమాప్తి

ప్రసారము III

1-00* కదంబం†
1-40 హిందీలో వార్తలు
1-50 వాద్యసంగీతం†
2-00 తమిళమున వార్తలు
2-10 విరామ సంగీతము†
2 15 భక్తిపాటలు: టి. ఎమ్. హనీఫా
2-45* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

4-45* వివిధభారతి
5-45 సంగీతపాఠం
6-00 స్థానికప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 గ్రామస్థులకు
7-15 తమిళమున వార్తలు
7-30 మలరుం వాయ్‌కై:
కృషి నిలయంగళ్
ప్రసంగము (తమిళము)
ఎన్. సేతురఘునాథన్
7-45 సీతామణీ శ్రీనివాసన్
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 మద్రాస్ బి వలె
9-30 జానపద గేయాలు
9-50 మన్నర్గళ్ నార్పని:
మొఘలాయర్గళ్
ప్రసంగం (తమిళము)
10-00* ప్రసార సమాప్తి

*సమయసూచన † గ్రామఫోన్ రికార్డ్ ‡ సాతత్యా రికార్డింగ్

## ప్రసంగములు

<u>మద్రాస్</u>

మే 2 బు॥ రా॥ 7-45 చారిత్రక సాహిత్యము :
క్రీడాభిరామము
ఎన్. వెంకటరావు

,, 3 గు॥ మ॥ 1-00 జాతీయ సమైక్యత—
మన ఆదర్శాలు

,, 9 బు॥ రా॥ 7-45 వినూత్న అనుభూతి—
కళాకారులు
హెచ్. వి. రామ్‌గోపాల్

,, 14 సో॥ రా॥ 9-15 రసమయి
భారత ఆంధ్రీ కరణోదంతము
బులుసు వెంకటరమణయ్య

<u>విజయవాడ</u>

మే 5 శ॥ మ॥ 1-00 వేసవి విడుదులు : అరకులోయ
టి. శకుంతల

,, 7 సో॥ మ॥ 12-30 చారిత్రక దృష్టిలో ఐక్యభారతం:
బుద్ధయుగం
ఎ. గోపాలరావు

,, 8 మం॥ సా॥ 6-15 ఈ శతాబ్ది పూర్వార్థములో
దివంగతులైన కొందరు కవులు, సాహిత్య వేత్తలు:
వేదము వేంకటరాయశాస్త్రి

,, 12 శ॥ రా॥ 7-30 'జీవితంలో హాస్యము'
చింతలపాటి లక్ష్మీనరసింహశాస్త్రి

<u>హైదరాబాద్</u>

మే 1 మం॥ సా॥ 6-15 పేద బ్రతుకు కథానిక
రచన: ఇసుకపల్లి దక్షిణామూర్తి

,, 3 గు॥ రా॥ 7-30 మావూళ్ళో : వీధి అరుగు
దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రి

,, 6 ఆ॥ రా॥ 7-15 'మోతీలాల్ నెహ్రూ'
ఎమ్. ఎస్. రాజలింగం

,, 7 సో॥ మ॥ 1-30 రవీంద్రుని సంస్కృతి
డా॥ బి. గోపాలరెడ్డి

,, ,, ,, రా॥ 9-15 'భారత దర్శనము'
కోట సుందరరామశర్మ

,, 9 బు॥ రా॥ 9-15 గోపాలకృష్ణ గోఖలే
బుద్ధిరాజు రాజభూషణరావు

,, 10 గు॥ రా॥ 7-30 ఆదర్శ నగరము :
ఆదర్శ పురపాలక సభ్యుడు
సి. నరసింహం

,, 15 మం॥ సా॥ 6-15 గాజుల బత్తుడు: తూలికా చిత్రం
మునివల్లి సరోజినీదేవి

## నాటికలు, రూపకములు

<u>మద్రాస్</u>

మే 7 సో॥ రా॥ 9-15 చిత్తరువు ** నాటిక
రచన: జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి
నిర్వహణ : ఉమ

,, 13 ఆ॥ మ॥ 3-00 సిఫార్సు ఉత్తరము
నాటిక
మాలిని నాటిక

,, 14 సో॥ రా॥ 9-15 లజ్ కార్నర్ ** నాటిక
రచన: మాలతీ చందూర్

<u>విజయవాడ</u>

మే 2 బు॥ రా॥ 8-00 మనమంతా ఒకటే నాటిక
రచన: వేదుల లక్ష్మణమూర్తి

,, 5 శ॥ రా॥ 9-15 జాలిగుండె నాటిక
నండూరి విఠల్

,, 6 ఆ॥ మ॥ 3-00 'రామచంద్ర విజయం' నాటిక
కీ॥శే॥ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి నవలకు
రేడియో అనుసరణ
కొండముది హనుమంతరావు

,, 8 మం॥ రా॥ 7-45 పోస్ట్ ఆఫీస్
టాగూర్ నాటికకు రేడియో అనుసరణ:
విద్వాన్ విశ్వం

,, 11 శు॥ రా॥ 9-30 'పల్లగింజలో'
రచన: నండూరి సుబ్బారావు

<u>హైదరాబాద్</u>

మే 1 మం॥ సా॥ 6-30 'సువర్ణ ద్వారం'
సంగీత రూపకం
రచన: స్ఫూర్తి శ్రీ

,, 4 శ॥ రా॥ 9-15 చిత్రనళీయంలో బాహుకుడు
ఏకపాత్రాభినయం :
బందా కనకలింగేశ్వరరావు

,, 8 మం॥ సా॥ 6-30 ఎంత సుదినము! నాటిక
రచన: యశోదా తిరుమలరెడ్డి

,, 9 బు॥ రా॥ 8-00 పొట్టులోబావి నాటిక
రచన : పి. సత్యనారాయణమూర్తి

# సంగీత కచేరీలు

## మద్రాస్

మే 2 బు॥ రా॥ 9-45 పి. కె. మదురై: నాదస్వరం
,, 3 గు॥ రా॥ 7-45 రాగం, తానం, పల్లవి
టి. విశ్వనాథం: వేణువు
ఆర్. కె. వెంకటరామశాస్త్రి: వయొలిన్
టి. రంగనాథన్, మృదంగం
,, 4 శు॥ రా॥ 7-30 టి. కె. రంగాచారి
కోయంబత్తూర్ బి. దక్షిణామూర్తి: వయొలిన్
దండమూడి రామమోహనరావు. మృదంగం
,, 6 ఆ॥ ఉ॥ 8-15 విమలా కృష్ణమూర్తి
,, ,, ,, మ॥ 3-00 శీర్కాళి సదాశివం పిళ్ళె
,, 7 సో॥ రా॥ 9-30 తిరువావడుమురై ఎ. అణ్ణామలై: నాదస్వరం
,, 8 మం॥ రా॥ 7-45 టి. కె. రాధాకృష్ణన్: వేణువు
చిత్తూర్ గోపాలకృష్ణన్: వయొలిన్
శుచీంద్ర కృష్ణన్: మృదంగం
,, 10 గు॥ రా॥ 7-45 రాగం, తానం పల్లవి
ముదికొండాన్ వెంకటరామ అయ్యర్
,, 11 శు॥ రా॥ 7-30 ద్వారం వెంకటస్వామి నాయుడు: వయొలిన్
ద్వారం మంగతాయారు: వయొలిన్
మద్రాస్ ఎ. కణ్ణన్: మృదంగం
ఆర్. ఎస్. కృష్ణమూర్తిరావు: ఘటం
,, 13 ఆ॥ ఉ॥ 8-15 సంధ్యావందనం శ్రీనివాసరావు
,, 14 సో॥ రా॥ 9-30 దేవకోటై ఎ. నారాయణ అయ్యంగార్: వీణ
మద్రాస్ ఎ. కణ్ణన్: మృదంగం

## విజయవాడ

మే 1 మం॥ ఉ॥ 7-30, రా॥ 8-00 } కవిరాయని జోగారావు: వీణ
,, 3 గు॥ ఉ॥ 7-30, మ॥ 1-00 కందుకూరి వెంకటముని నాదస్వరం
,, 8 మం॥ ఉ॥ 7-30, మ॥ 1-30 ఎ. వెంకటేశ్వరరావు: వయొలిన్
,, 9 బు॥ మ॥ 1-30, రా॥ 9-50 జంధ్యాల సత్యనారాయణమూర్తి
,, 10 గు॥ ఉ॥ 7-30, రా॥ 1-00 కె. కణ్ణన్: వేణువు
,, 11 శు॥ మ॥ 1-00, రా॥ 9-45 ఆకెళ్ల ప్రభాకరమూర్తి
,, 12 శ॥ ఉ॥ 7-30, రా॥ 8-00 } నిటదొడ్డి సత్యవతి
,, 14 సో॥ రా॥ 7-30 ఎమ్. వి. రమణమూర్తి
డి. పాండురంగరాజు: వయొలిన్
శ్రొవ్విడి హనుమంతరావు: మృదంగం
అన్నవరపు గోపాలం: ఘటం
,, 15 మ॥ ఉ॥ 7-30, రా॥ 8-00 వెలిది సుబ్బారావు: వేణువు

## హైదరాబాద్

మే 2 బు॥ ఉ॥ 7-30, మ॥ 2-00 ద్వారం దుర్గాప్రసాదరావు: వయొలిన్
,, 4 శు॥ ఉ॥ 7-30, మ॥ 1-00 కె. సీతారామయ్య
,, 6 ఆ॥ ఉ॥ 8-30 పద్మా గోపాలకృష్ణన్
రా॥ 7-30 చిత్తూర్ సుబ్రహ్మణ్య పిళ్ళె
నేతి శ్రీరామశర్మ: వయొలిన్
పి. కె. శ్యామసుందర్: మృదంగం
,, 7 సో॥ ఉ॥ 7-30 కాశీనాథ్ ముఖర్జీ: సితార్
,, 8 మం॥ మ॥ 2-00, 8-30 ఎ. మృణాళిని
,, 11 శు॥ రా॥ 9-45 రాగం, తానం, పల్లవి
మారెళ్ళ కేశవరావు: వయొలిన్
వి. ఎస్. లక్ష్మీనారాయణన్: మృదంగం
,, 13 ఆ॥ ఉ॥ 8-30 ఎస్. సి. సత్యనారాయణ
పి. కుప్పుస్వామి: వయొలిన్
ఎస్. వెంకటరమణ: మృదంగం
,, ,, ,, రా॥ 8-30, 10 00 సిహెచ్. భీమశంకర్‌రావు: ఖయాల్
,, 14 సో॥ ఉ॥ 7-30 డి. పార్వతీకర్: దత్తాత్రేయవీణ

## బెంగుళూర్

మే 2 బు॥ రా॥ 8-15 ఎమ్. లక్ష్మీనారాయణశాస్త్రి: వీణ
కె. ఎన్. కృష్ణమూర్తి: ఘటం
,, 6 ఆ॥ ఉ॥ 8-30 పార్వతీ మహాదేవన్
,, 9 బు॥ రా॥ 8-15 ఎమ్. జి. సరోజ
ఎమ్. జి. ఇ దిర: వయొలిన్
కె. యు. కృష్ణమణి: మృదంగం
,, 12 శ॥ రా॥ 8-00 టి. నాగమ్మ
వాద్యబృందంసహా
,, 13 ఆ॥ ఉ॥ 8-30 ఆర్. ఎస్. కేశవమూర్తి వీణ
కె. ఎస్. గోపాలరావు: మృదంగం
,, ,, ,, రా॥ 8-15 ఎస్. బి. కేశవమూర్తి
,, 14 సో॥ రా॥ 8-15 వి. రామరత్నం
,, 15 మం॥ రా॥ 9-30 గంగూబాయి హంగల్: హిందూస్థానీ గాత్రసంగీతం

## తిరుచ్చి

మే 1 మం॥ రా॥ 7-15 మయూరం ఎస్. రాజం
,, 4 శు॥ ఉ॥ 7-30 విరాళిమలై ఎ. ఎస్. సింగారం: నాదస్వరం
,, 6 ఆ॥ రా॥ 7-30 అయ్యంపేట ఎస్. వేణుగోపాలపిళ్ళె. నాదస్వరం
,, 9 బు॥ ఉ॥ 7-30, రా॥ 8-00 సి. మదనగోపాల్: వీణ
,, 11 శు॥ ఉ॥ 7-30 తిరునల్వేలి ఎస్. ఎస్. నారాయణన్ సోదరులు: నాదస్వరం
,, 13 ఆ॥ మ॥ 3-00 బాలం రామమూర్తి
,, ,, ,, రా॥ 7-30 టి. సుబ్రహ్మణ్య దేశికర్
,, 15 మం॥ రా॥ 7-45 సీతామణి శ్రీనివాసన్

# దృష్టిదానము

[ నాటిక ]

మూలం : రవీంద్రుని కథానిక

తెలుగు : జనమంచి రామకృష్ణ

దాదా : అవినాశ్, వైద్యంలో సంపాదిస్తూన్న మిడిమిడి జ్ఞానంతో కుముదిని కళ్ళు పోగొడతావా, లేక మరొక మంచి డాక్టర్నెవరినైనా తెమ్మంటావా? నిష్కారణంగా దాని కళ్ళు పోగొడ్తున్నావేమోనని భయంగా వుంది బావా.

అవినాశ్ : (కోపంగా) బావా, కుముదిని నీ చెల్లెలైతే కావచ్చు. ఒకటి మాత్రం తెల్సుకో. ఆమె నా భార్య. నా భార్య కళ్లుపోతే నాకు కావూ? దయచేసి మా కుటుంబ విషయంలో జోక్యం కల్గించుకోవద్దని కోరుతున్నా.

కుముదిని : (ఖిన్నురాలై) అన్నయ్యా, నా కంటిజబ్బు గురించి మా ఆయనకంటే మరొక డాక్టరుకి బాగా తెలుసునా? ఎందుకిలా అనవసరంగా జోక్యం కలిగించుకుంటావ్?

దాదా : (ఆశ్చర్యంతో) చెల్లీ, నీకేమైనా మతిపోయిందా? మెడికల్ కాలేజీ స్టూడెంటేగా మీ ఆయన. ఆయనకి....

కుము : ఔను. ఆయనకి నా కళ్ళగురించి ఎంతో బాగా తెలుసు. మునపటి కంటే చూపు ఎంతో బాగా అనుతూంది. ఐనా, నా సుఖదుఃఖాల గురించి మా వారికి తెలిసినంత బాగా ఇతరులకి ఎన్నడూ తెలియదు.

దాదా : సరే, చెల్లీ. నా రక్తంలో రక్తానివి కాబట్టే, నేనీ తపనపడుతున్నా. కళ్లుపోతే....అబ్బా, ఆ మాట తల్చుకుంటే భయం వేస్తూంది.

* * * *

అవి : (ఆదుర్దాగా) కుమూ....

కుము : ఏమండి?

అవి : ఈవేళ ఎలా ఉన్నాయ్ నీ కళ్లు?

కుము : మీరు చెప్పినవన్నీ చేశాను. కళ్ళకు గంతలు కట్టుకున్నా. గంతల పైన చలవజోడు తగిలించా. మీరు వేసుకోమన్న అరకు కళ్ళల్లో వేసుకున్నా. ఆ పౌడర్లన్నీ తీసుకున్నా. ఆఖరికి ముక్కుమూసుకుని ఎలాగో అలా చేపనూనె కూడా తాగా.

అవి : కొంచెం నయంగా ఉండి తీరాలే?

కుము : కొంచెమేమిటి? బాగా నయంగా ఉంది. నీరు కారడం మానేసింది తెలుసా?

అవి : నిజంగా.

కుము : ఊఁ.

అవి : ఈ వేళ్లెన్నో చెప్పు కుమూ.

కుము : చెప్పనా....

అవి : (బాధతో) అదేమిటి కుమూ, కళ్ళతో చూసి చెప్పమంటే తడుముకుంటూ నా చేయి పట్టుకు వేళ్లు లెక్కపెడుతున్నావ్! కనిపించడం లేదా?

కుము : (బాధలో) లేదు.

అవి : కుమూ. ఇంక నా చేయి జారిపోయిందనుకుంటాను. డాక్టర్ని పిలిపిస్తా.

కుము : ఛా. మీకంటె ఆ డాక్టరుకి ఏం తెలుసునని? మీరేం కంగారు పడకండి. అదే వస్తుంది చూపు!

* * * *

అవి : (బాధతో) కుమూ, నా కుమూ, నా తెలివితక్కువచేత నీకు అంధత్వం తెచ్చిపెట్టాను. నీ కళ్ళనుండి వెలుగు నార్పేశా. ఎంత పాపిని కుమూ. ఎంత పాపిని!

కుము : (అప్యాయంగా) ఛా. కంట నీరెట్టుకోకండి. మీరేం చేశారని? ఇదే మరో డాక్టరువచ్చి చేస్తే జీవితాంతం మనిద్దరం ఏడ్చి ఉండేవాళ్ళం. ఈ బాధలో, ఈ అంధత్వంలో నాకొక కొత్త ఆనందం కలుగుతూంది. మీరేం బాధపడవద్దు. ఇకనుంచి మీ ఆనందమే నా ఆనందంగా, మీ అనుభవాలే నా అనుభవాలు. నాది అనే అహంభావాన్ని చంపుకుని దైవసమానులైన మీతో తాదాత్మ్యం పొందడం ఎన్ని జన్మలెత్తితే లభిస్తుంది చెప్పండి.

అవి : కుమూ, నీ దృష్టితో చెలగాటం ఆడాను. తెలిసీ తెలియని జ్ఞానంతో నీ నేత్రాలనుండి జ్యోతిని ఆర్పేశా. ఏం చేసేది? నీ సుఖంకోసం నీ ఆనందంకోసం, సర్వకాల సర్వావస్థలయందూ నీ చెంతనే ఉంటాను కుమూ.

కుము : ఛా. ఏమిటా బేలతనం? నేనొక మాట చెబుతా వింటారా?

అవి : ఏమిటది?

కుము : మీరు తిరిగి వివాహం చేసుకోండి!

అవి : (బాధతో) ఏమిటి నీవనేది! చేసినపాపం చాలక ఇదొకటా. ఈ జన్మలో అటువంటి పని ఎన్నడూ చేయనని వాగ్దానం చేస్తున్నా.

కుము : (వెర్రిగా నవ్వుతూ) మీకు బాధ కలిగించానా? మీ సుఖంకోసం మరో పెళ్ళి చేసుకోమని కాదు నా ఉద్దేశ్యం. నా గురించే మిమ్మల్ని మరో పెళ్ళి చేసుకోమంటున్నా. చూడండి. నేను గుడ్డిదాన్నైపోయా. మీకా చిల్లిగవ్వంత సేవైనా చేయలేని స్థితిలో వున్నా. మరొక ఆమె వచ్చి మీకు సేవచేస్తుంటే నాకు మనఃసంతృప్తి వుంటుందనే ఉద్దేశంతోనే అలా చెప్పాను.

అవి : సేవ! పనివాళ్లు లేరూ. నా ఆరాధ్యదేవతను కిందకు తోసి, మరొకతెను అందల మెక్కిస్తాననుకున్నావా కుమూ....కుమూ....?

కుము : ఊఁ....

అవి : కలకత్తా వదిలేసి, హాసింగపూర్ వెళ్ళిపోదాం. అక్కడే ప్రాక్టీస్ పెడతా.

కుము : నాకూ యీ కలకత్తా అంటే విసుగెత్తిపోతుంది. హాయిగా పల్లెటూరులో ఈ నగర వాతావరణం ఉండదు. ప్రశాంతంగా వుందాము. పైగా పల్లెటూరి ప్రజలకు సేవచేస్తే ఇంత ముక్తి మోక్షం కలుగుతుంది. తప్పకుండా వెళ్ళిపోదామండి.

[రైలు వెడుతున్న ధ్వని]

* * * *

కుము : నా భర్త యిలా ఎందుకు మారిపోయారు? డబ్బు ఎంత పాపిష్ఠిది! డబ్బు రావడంతోనే ఏ మనిషిలో మానవత్వం నశించిపోతుంది కాబోలు, పూర్వము—అంటే ఇంత సంపాదన లేనప్పుడు—ఆయన హృదయం నవనీతమే. ఇప్పుడెంత కాఠిన్యం? నా పట్లకూడా ఇంత ఉదాసీనతా? ఔను, గుడ్డిదాన్ని. భర్తయినా ఎంతకాలం సహించగలరు?

[దుఃఖిస్తుంది....కారాగిన చప్పుడు]

అవి : (వస్తూ) కుమూ, కుమూ....ఏమిటాలోచిస్తున్నావు? కిటికీదగ్గర కూర్చున్నావు....ఎవరొచ్చారో చూడు.

కుము : (జాలిగా నవ్వుతుంది.)

అవి : పొరబాటు. ఎవరొచ్చారో చెప్పనా? మాపిన్ని వచ్చింది,

కుము : నమస్కారం, రండి, రండి.

అత్త : ఛీ, ఛీ, లేవకు. బల్ల కాలికి తగిలి పడతావు. కళ్ళు పోవడం అలా వుంచి, మా వాడికీ నిర్బంధం కూడా తెచ్చిపెట్టావెందుకు? పెళ్ళి చేసెయ్యి వాడికి. వాడైనా సుఖపడాలా?

అవి : (మోసగించే బుద్ధితో) నిజంగా అంటున్నావా పిన్నీ. ఛా, అటువంటి మాటలనకు.

అత్త : కుర్రకుంకవు. నీకేం తెలుసురా. నేనేమైనా తప్పన్నానా, కుముదినీ?

కుము : (వెర్రిగా నవ్వుతూ) అబ్బే, మీరు న్యాయంగానే మాట్లాడారు.

అత్త : అబ్బాయి అవినాష్, హేమాంగిని తెలుసుగా. చిలకలా వుంటుంది,

అవి : ఏమిటి పిన్నీ, పెళ్ళి ఏర్పాట్లన్నీ చేసేసి వచ్చినట్లుగా మాట్లాడుతున్నావు?

అత్త : 'ఆలస్యం అమృతం విషం' అన్నారు. దీంట్లో ఆలోచించేందుకేముందిరా?

కుము : (బాధతో) పరమేశ్వరా, నా భర్తని రక్షించు తండ్రీ.

* * * *

అత్త : హేమా, మీ అక్కయ్యకు నమస్కారం చెయ్యి....కుముదినీ, హేమాంగిని. నువ్వు చూడలేదనుకుంటా.

హేమాంగిని : నమస్కారం అక్కా.

కుము : సుమంగళీభవ, ఎంత అందంగా ఉన్నావమ్మా!

హే : (కిలకిలనవ్వి) కళ్ళతో చూసినట్లే నా అందాన్ని పొగడుతున్నావే?

కుము : (ఖిన్నురాలై) గుడ్డిదాన్నే చెల్లీ. నా వళ్ళంతా కళ్ళచేసుకు చూడడం అలవాటు చేసుకున్నా.

అవి : (వస్తూ) అరే, ఎవరీ అమ్మాయి?

అత్త : అరే, అబ్బాయి, (నవ్వుతూ) ఎందుకంత సిగ్గుపడుతూ వెళ్ళిపోతావు. హేమాంగినిరా.

అవి : ఓ హేమాంగినా? ఎందుకు పిన్నీ ఆ అమ్మాయిని రప్పించావు?

అత్త : ఏమిటిరా ఆ తెలివితక్కువ మాటలు. చూడు, వెళ్ళిపోకు. (నవ్వుతూ) సిగ్గుపడి వెళ్ళిపోతున్నాడు....అమ్మాయి హేమా, నేను లోపలికెళ్ళి పనులు చూసుకుంటా.

హే : సరే అత్తా. చూడు కుముది నక్కా, ఆ ముసలావిడుందే, చండశాసనురాలు. ఎవ్వరూ పిలవనక్కర్లేదు. వచ్చి తిష్టవేస్తుంది. కొంతకాలందాకా కదలదు తెలుసా? (నవ్వుతుంది) అవును కాని, నాన్న నన్నెందుకు ఇక్కడికి పంపాడంటావు?

కుము : (నవ్వుతుంది.)

హే : అక్కా? నీకు సంతానం లేదెందుచేత?

కుము : నేనేం చెప్పగలను హేమా? భగవంతుని దయ కలగలేదేమో!

హే : ఊహుఁ, అదికాదు కారణం. నువ్వు పాపం చేసుంటావక్కా. మా అత్తను చూశావా. ఆవిడకీ సంతానం లేదు. పాపం చేసి ఉంటుంది.

కుము : (నిట్టూర్చి) పరమేశ్వరా, నీకే తెలుసు కారణము.

హే : (ఖిన్నురాలై) అక్కా, ఎందుకలా నిట్టూరుస్తావు. నా మాటలు ఖాతరు చేయకక్కా. నేను వాగుడుకాయను. అక్కా, అలా అర్థం లేకుండా వాగుతూంటా. (నవ్వుతుంది)

* * * *

దాదా : చెల్లీ! నిన్ను చూడకుండా ఎలా వుండగలనమ్మా? నాకు తెలుసు, బావకి నేను రావడం ఇష్టం లేదు. చెల్లీ! హాస్పిటల్‌కి కొత్తగా వెళ్ళడం మనేసి ఇంటిదగ్గిరే ఉండిపోతూన్నట్లున్నావే.



రైతుకుటుంబము—ఆదర్శగ్రామం, దెందులూరు

కుము : ఔను అన్నయ్యా. ఏదో అలా ఒకసారి వెళ్ళి వెంటనే తిరిగి వచ్చేస్తారు. పాపం రోగులు మందులకోసం–ఈయనకోసం కాచుకునుండలేక బాధపడుతున్నారు.

దాదా : నాకు అంతా తెలిసిపోయిందమ్మా. ఇరవై నాలుగ్గంటలూ అత్త తోనే మంతనాలు సాగిస్తున్నాడు. హేమ....

కుము : (ఏడుస్తుంది.)

దాదా : ఏడవకు. నేను వెళ్ళిపోతున్నా. దేవునిమీద భారంవేసుకో చెల్లీ. అంతే.

కుము : (నిట్టూరుస్తూ) పరమేశ్వరా, అంతా నీ లీల. (కంగారుగా) ఎవరు ? ఎవరు నా పక్కమీద కెక్కింది ?....మాట్లాడరే ?.... ఎవరది ? హేమా ?

హే : అక్కా ! నేను రేపు వెళ్ళిపోతున్నా.

కుము : (ఆశ్చర్యంతో) ఏం చెల్లీ ! ఇక్కడ బాగాలేదా ?

హే : నీ దగ్గర ఉండాల్నే వుంది అక్కా. కాని అత్త అసహ్యంగా ప్రవర్తిస్తోంది. నేనొక్క క్షణం ఇక్కడుండదల్చుకోలేదు. (అడుగుల చప్పుడు.)

అత్త : (దూరంనుంచి) హేమా....

హే : అదుగో అత్త ఇక్కడికే వస్తూంది....

అత్త : హేమా....ఒక్కక్షణం నా దగ్గిరుండవు కదా ! చూడు.

హే : ఏమిటది ?

అత్త : చూడు ! ఎటువంటి ఉంగరం తెచ్చాడో అవినాష్ !

హే : ఎవరికోసం ?

అత్త : ఇంకెవరికోసం ? నీకోసమే.

హే : ఓహో ! అయితే యిలాతే. నేనూ ఎంత నేర్పుగా రాళ్ళ విసర గలనో తెలుసా ? ఈ ఉంగరం చూడు సరిగ్గా చెరువులో పడుతుంది.

అత్త : అఁ, అఁ....ఎంతపని చేశావే పాడుపిల్లా, నీకేమైనా మతి పోయిందా ఏమిటే ? (ఆదుర్దాగా) కుముదినీ, చూడమ్మా, యీ సంగతి మీ ఆయనతో చెప్పకుమ్మా. తెలిస్తే చాలా బాధపడతారు.

కుము : ఎందుకు చెబుతానత్తా ? వెళ్లిపోతున్నారా ?

అత్త : (చిరాకుగా) నా మనస్సేమీ బాగులేదు కుముదినీ ; హేమకి యీ చిలిపితనము ఎప్పుడు పోతుందో. వజ్రపుటుంగరం గంగపాలు చేసింది.

హే : (నవ్వుతూ) పీడ విరగడైంది అక్కా ! నన్ను మర్చిపోతావా ? నిన్ను వదిలిపోవాలని లేదు. కాని పరిస్థితులు తరిమివేస్తున్నాయి అక్కా ! మరి నన్ను మర్చిపోనని ఒట్టేయ్.

కుము : (నవ్వుతూ) వెర్రిదానా, నిన్నెలా మర్చిపోతానమ్మా ? ద్విజులకి పూర్వస్మృతులు పరమపవిత్రాలు. అవే నెమరువేసుకుంటూ జీవితాన్ని గడుపుతారు.

అవి : కుమూ ! పక్కవూళ్ళో రోగిని చూడ్డానికి వెళ్లాల్సి వుంది. రోగి ప్రమాదమైన స్థితిలో వున్నాడట ! వస్తే వెంటనే వచ్చేస్తా. లేకపోతే రెండు మూడు రోజులు పడుతుందేమో !

కుము : (పిచ్చిగా) ఎందుకు అబద్ధాలాడుతున్నారు ?

అవి : (తడబడుతూ) అబద్ధాలా ? నేనేం అబద్ధం చెప్పడం లేదే.

కుము : (నిశ్చయంతో) మీకు పెళ్లి కాబోతూంది. నిజం చెప్పండి... మాట్లాడరే....?

అవి : ఔను.

కుము : (పిచ్చిగా) వీల్లేదు. ఎన్నటికీ నేనొప్పుకోను. మీరు పాపానికి ఒడికట్టుకున్నారా ! ఈ పనికి పూనుకోకండి. (ఏడుస్తుంది) నేనేం అపరాధం చేశాను ? నాలో ఏం తక్కువని మరో వివాహానికి సన్నద్ధులవుతున్నారు ? నిజము చెప్పండి. మరో భార్య మీకెందుకు ?

అవి : (శాంతముగా) నిజము చెబుతున్నా కుమూ. నీవంటే నాకు భయం పట్టుకుంది. అంధత్వం నిన్ను తన చీకటికోటలో బంధించింది. లోనికి ప్రవేశిద్దామని ప్రయత్నిస్తున్నా, కాని సాధ్యపడ్డంలేదు. అదేమిటో ! నువ్వు సాధారణ వ్యక్తిగా కనిపించడములేదు. దేముడంటే ఎంత భయపడతానో అంత భయం నిన్ను చూస్తే కలుగుతూ ది. నిత్యజీవనం నీతో సాగించలేకుండా వున్నా. నాకు ఒక సాధారణ స్త్రీ కావాలి. లాలించేందుకు, కూకలేసేందుకు, భిడియం లేకుండా జీవించేందుకు.

కుము : (ఏడుస్తూ) నా హృదయం చీల్చి చూడండి. నేను మాత్రం సాధారణ స్త్రీని కానా ? పెళ్ళినాటి కుముదినే యీనాటి కుముదినికూడా–నాలో ఏం మార్పులేదే ! (వెళ్లిన అడుగుల చప్పుడు) ఏమండీ.... (ఏడుస్తూ) ఏమండీ, వెళ్లిపోతున్నారా ! (ఏడుస్తుంది) పరమేశ్వరా, ఎంత అన్యాయానికి ఒడికట్టుకున్నారు నా భర్త ! వారిని రక్షించు తండ్రీ ! రక్షించు పరమేశ్వరా !! (ఏడుస్తుంది.)

*   *   *   *

దాదా : (తలుపు దబాదబా కొట్టి) చెల్లీ ! చెల్లీ ! కుమూ....తలుపుతియ్యి.... తలుపు తియ్యమ్మా ! నేనూ—అన్నయ్యనమ్మా (తలుపు గట్టిగా కొడతాడు) చెల్లీ !....

కుము : (తెప్పరిల్లి) ఎవరు ? అన్నయ్యా....

దాదా : చెల్లీ ! ఏమిటిలా స్పృహలేకుండా పడిపోయావు ?

కుము : (బిట్టువగిలి ఏడుస్తుంది.)

దాదా : ఛా, ఏడవకు.

కుము : అన్నా ! అనుకున్నదంతా....

దాదా : (నవ్వుతూ) ఏమీ కాలేదులే ! ఎవరొచ్చారో తెలుసా ?

కుము : అన్నా....

దాదా : అన్నయ్య సరేలే. ఈ వ్యక్తి ఎవరో తెలుసా ?

హే : అక్కా !....

కుము : (అమిత ఆనందంతో) హేమా....నా చెల్లి హేమ వచ్చిందా ! హేమా !....(ఏడుస్తు ది.)

హే : ఛా! అదేమిటక్కా! కంట తడిపెట్టక. సుమంగళీభవ అని దీవించు.

కుము : (సీరియస్‌గా) ఔను! నువ్వేం తప్పుచేశావ్ చెల్లీ! నీమీద కోప గించడానికి. నిన్ను తప్పక దీవిస్తా!

హే : (గట్టిగా చిలిపిగా నవ్వి) తప్పు. నువ్వు పెళ్ళి చేసుకోవడం ఒప్పా! నేను పెళ్లిచేసుకుంటే తప్పా! ఏమిటక్కా నువ్వనేది?

కుము : నిజమే చెల్లీ! తెలివితక్కువదాన్ని. సుమంగళీభవ! హాయిగా కలకాలం భార్యాభర్త లిద్దరూ ఆయురారోగ్య భోగభాగ్యాలతో జీవించండమ్మా!

హే : అక్కా! నన్నొక్కర్తెనే దీవిస్తే చాలదు! నా భర్తకూడ ఇక్కడే వున్నారు.

కుము : అన్నట్లు, ఆయన్ని కూడా ఇక్కడికి తీసుకురా చెల్లీ.

దాదా : చెల్లీ....

కుము : అన్నా....

హే : (విరగపడి నవ్వుతుంది.) నా భర్త ఎవరో తెలిసిందా?

కుము : (ఆశ్చర్యంతో) అన్నా! నువ్వు హేమంగినిని . .

హే : ఆఁ, లేకపోతే.

కుము : ఆయనేరీ?....పరమేశ్వరా. ఎంత దయతండ్రీ! ఆయన్ని రక్షించి నందు కెంతైనా కృతజ్ఞురాలిని ప్రభూ!

హే : మీ అన్నయ్య ఘోటకబ్రహ్మచారిలా వుండిపోవాలనుకున్నారటగా!

కుము : అవును చెల్లీ!

హే : (గర్వముగా) మంత్రం చల్లాను. ఆ బ్రహ్మచారి దీక్ష ఏమైంది! (నవ్వు) మీ అన్నయ్య నడుగు అక్కా!

కుము : అడగక్కర్లేదు. నాకంతా అర్థమైంది. అన్నా! నీ చెల్లెలికోసం!

దాదా : ఏం లేదులే! కుమూ! ఏదీ ఒక్కసారి ఆప్యాయంగా నవ్వుతల్లీ! ఊఁ....నవ్వాలిమరి! లేకపోతే కితకితలు పెట్టి నవ్విస్తా!

కుము : (సన్నగా ఆప్యాయంగా నవ్వుతూ) వారేరి అన్నయ్యా?

దాదా : వస్తార్లే. ఎక్కడికి పోరారు? నిరాశ, అవమానంతో బాధపడుతూ కాళ్ళీడ్చుకు మీ వస్తున్నారల్లే వుంది. మరేం కంగారుపడకు చెల్లీ.... హేమా! లోపలకి నడు. పెళ్లి, ప్రయాణము రెండూ ఒంటిని హూనం చేసిపారేశాయి. కాస్త వేణ్ణీళ్లు పెట్టు . . నడూ . లోపలికి.

[సంగీతము]

*            *            *            *

కుము : ఆయనని రక్షించు పరమేశ్వరా! అవమానం జరిగిందట. ఎంత బాధపడుతున్నారో! (చటుక్కున) చేతులు పట్టుకు టూన్న దెవరు? (ఆప్యాయతో) ఆఁ, మీరా! వచ్చారా! నా దగ్గరకా కూచోండి! అబ్బా! ఎన్నాళ్ళకి-ఎన్నాళ్ళకి. (ఆవేశపడుతుంది)

అవి : (ఖిన్నమనస్సుతో) కుమూ! నా కుమూ!! నాశనమైపోతూన్న నన్ను రక్షించాడు మీ అన్న. నన్ను పతనంనుండి రక్షించాడు కుమూ! నువ్వు సామాన్యురాలివి కావు. నా ఆరాధ్యవు కుమూ! నా ఆరాధ్యవు!

కుము : (నివారిస్తూ) ఛా, ఎందుకలా కుమిలిపోతారు! నేను సామాన్యురాలిన్నండి! మీ భార్యను! మీ చరణదాసిని.

అవి : కాదు-ఎన్నటికీ కాదు. నీవే నాకు—అంధునికి—దృష్టిదానము చేశావు కుమూ....

కుము : (నవ్వుతుంది.)



గుడిపాటి దుర్గామహాలక్ష్మి
పిల్లల కార్యక్రమములో హరికథ
(విజయవాడనుండి ప్రసారితము)



శుభ్యలేఖ నాటికలో పాత్రధారులు (విజయవాడ కేంద్రమునుండి ప్రసారితము)

## శ్రీ శ్యామశాస్త్రి జయంతి ద్విశత వార్షికోత్సవాలు

శ్యామశాస్త్రి కర్ణాటక సంగీత త్రిమూర్తు లలో ఒకరు. త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితులు, శ్యామా శాస్త్రి ఈ ముగ్గురూ మద్రాసు రాష్ట్రం తంజావూరు జిల్లా, తిరువారూరు లలో, ఒకే గ్రామంలో జన్మించారు. ఈ ముగ్గురూ మనకు ప్రసాదించిన సంప్రదాయం ఉన్నతమైనది. ఈ త్రిమూర్తులు జీవించిన కాలం కర్ణాటక సంగీత చరిత్రలో స్వర్ణయుగంగా పరిగ ణింపబడుతూంది.

శ్యామశాస్త్రి రచనలు సంగీత సాహి త్యాల సమప్రాధాన్యం, తూకం కలిగి నవి. తాళం, లయల విన్యాసంలో అసా మాన్యమైన నేర్పు కూర్పులుకలడి. సంచార క్రమంలో చక్కని తూగును కల్పిస్తుంది. రచయిత శక్తి సామర్థ్యాల అధికారాన్ని ముద్రిస్తుంది.

శ్యామశాస్త్రి జన్మించింది 1762లో. ఆయన జన్మస్థలమైన తిరువారూరులో ఈ ద్విశత వార్షికోత్సవం మే నెల 5వతేదీన జరుగుతుంది. ఆల్ ఇండియా రేడియో వారు ఈ సందర్భంలో ఎన్నో ప్రత్యేక కార్యక్రమాలను ఏర్పాటు చేశారు.

జస్టిస్ టి. ఎల్. వెంకటరామయ్యర్ మే 5 రాత్రి 8-30కు ప్రసంగిస్తారు. శ్రీమతి డి. కె. పట్టమ్మాళ్, (జాతీయ సంగీత కార్యక్రమం తిరువారునుంచి) శ్యామాశాస్త్రి కృతులనే గానంచేస్తారు.

మే 6వ తేదీ రాత్రి 8-30కు తిరువా రూరులోని శామశాస్త్రి ద్విశత వార్షికోత్స వాన్ని గూర్చిన ప్రత్యేక వార్తాచిత్రం ప్రసారం అవుతుంది.

శ్రీ కె. పి. రంగాచారి రచించిన శ్యామాశాస్త్రి జీవితం మే 10వ తేదీరాత్రి 9-30కు ప్రసారం అవుతుంది.

ఈ కార్యక్రమాలన్నీ ఆకాశవాణివివిధ కేంద్రాలనుంచి రిలే చేయబడుతాయి.

తెలుగు భాగవతంలో పోతనచేసిన వామనావతార వర్ణన దానికిదే సాటి. ఆ విశ్వరూప వర్ణనలో పోతన భావమూ భాషా సరి ఉజ్జీలై పరవళ్లు తొక్కాయి. 'వామన్‌సేవ్‌కా విశ్వరూప్ వర్ణన్' అనే హిందీ ప్రసంగంలో శ్రీరామమూర్తి రేమి ఈ ఘట్టంలోని పోతన ప్రతిభను చిత్రిస్తారు. మే 2వ తేదీ సాయంత్రం 7-15 గంటలకు హైదరాబాద్-ఏ నుండి ఈ కార్యక్రమాన్ని వినవచ్చును.

* * * *

సంస్కృత స్తోత్ర వాఙ్మయంలో శివమహిమ్న స్తోత్రానిది మిక్కిలి ఉన్నత స్థానం. పుష్పదంతుడనే గంధర్వరాజు ఈ స్తోత్రాన్ని రచించిన సందర్భం, 'శివమహిమ' అనే నాటికలో వ్యక్తమవుతుంది. ఏప్రిల్ 30వ తేదీ సాయంకాలం 6-15 గంటలకు హైదరా బాద్ ఏ నుంచి దీనిని వినవచ్చును.

* * * *

సాహిత్య ప్రపంచానికి సుపరిచితుడు గాకపోయినా, కవి కర్ణపూర్ ప్రసిద్ధ సంస్కృతకవే. శ్రీ గయాప్రసాద్‌శాస్త్రి తన ఉదాహరణపూర్వక ప్రసంగములో ఈ కవిని హిందీ శ్రోతలకు పరిచయం చేస్తారు. మే 12వ తేదీ రాత్రి 7-15 గంటలకు దీనిని హైదరాబాద్-ఏ నుంచి వినవచ్చును.

* * * *

కృష్ణప్రభువు మానవ దైవభావాలకు తెంటికీ పేరు మోపినవాడు. గొల్లపిల్ల వాడగా గోపీలోలుడుగా రాధా సత్య భామా ప్రియుడుగా ఆయన పాములకు అందరికీ తెలుసు. పారిజాతాపహరణం కథ అందరికీ తెలిసిందే. మే 12వ తేదీ సాయంకాలం 6-15 గంటలకు జి.ఎల్. శర్మ బృందం వారి పారిజాతాపహరణం ఒగ్గు కథ హైదరాబాద్-బి, విజయవాడల నుండి ప్రసారం అవుతుంది.

## కాలక్షేపాని

హాస్య రూపకం

రచన: సోమంచి యజ్ఞన్నశాస్త్రి

నిర్వహణ: ఉమ

మేనమామకి సంతానం లేకపోడం చేత మాధవిని పెంచుకుందామని వారుం టున్న పల్లెటూరుకి తెచ్చుకుంటారు. మాధవి వాగుడుకాయ. పట్నవాసంలో పెరిగిందేమో అపల్లెటూళ్ళో ఏవీతోచక బాధపడుతూండేది.

ఓనాడు పత్రిక తిరగవేస్తూఎక్కడో జరిగిన దొంగతనం గురించి చదివి 'దొంగ సెప్పుడూ చూడలేదే! ఎలాపుం టాడో! ఓసారి కనిపిస్తే బాగుండిపోను —దొంగా మనిషే అంటారు నిజ మేనా!"అని అనుకుంటూండగా పొరుగూ రాయన తలుపు తట్టుతాడు. 'ఆహా' భగ వంతుడు నామొరాలకించి ఓ దొంగాణ్ణి పంపాడు. వీడి తడాఖా ఏదతాను అని వచ్చినాయనతో సంభాషణ ప్రారం భిస్తుంది.

క్రమంగా సంభాషణ దయ్యాల గురించి సాగుతుంది. ఉత్తినే మామయ్య రైలు ప్రమాదంలో చచ్చిపోయాడనీ, దానాదీనా అత్తయ్యకి పిచ్చిఎత్తిపోయిం దనీ చెబుతుంది.

ఇంతలో ఊరెళ్ళిన మామయ్య తిరిగి చక్కా వస్తాడు. అతన్నిచూసి దయ్య మేమోనని భయపడి వచ్చినాయన అరి పరుగు తీస్తాడు. మాధని విరగపడి నవ్వుతుంది.

కాలక్షేపానికి — హాస్య రూపకం ఏప్రిల్ మాసం 25వ తేదీ బుధవారం రాత్రి 8 గంటలకు మద్రాసు,విజయవాడ హైదరాబాదు కేంద్రాలనుండి వినగలరు.

## బొమ్మరిల్లు పాతమెంబర్ల పండగ

పిల్లలుగా బొమ్మరిళ్లు కట్టుకొని ఆడు కొంటారు. వారే తల్లులుగా, తండ్రు లుగా పిల్లలకు బొమ్మరిళ్లుకట్టిపెడతారు తాము కట్టిన బొమ్మరిళ్లలో పిల్లలతో పాటు తాముకూడా ఆడుకోవడం ఒక ముచ్చట, మురిపెమూను! బొమ్మరిల్లు పాతమెంబర్లు మే నెల 12వ తేదీ శని వారం మధ్యాహ్నం గం|| 2 మొదలు గం|| 3ల వరకు ఆకాశవాణి విజయ వాడ కేంద్రములో జరుగు బొమ్మరిల్లు కార్యక్రమంలో కలుసుకొని, తమ పూర్వ స్మృతులను తలుచుకొంటూ— పాటలు పాడి, ఆటలు ఆడి, ఆనంది స్తారు; ఆనంద పరుస్తారు—

సమర్పణ: ఏడిద కామేశ్వరరావు

## రాష్ట్రపతి వ్యక్తి చిత్రణ

రాష్ట్రపతి డా|| రాజేంద్ర ప్రసాద్ పదవీ విరమణకు కొన్ని రోజులు ముందుగా "రాష్ట్రపతి రూప చిత్రణ" (Portrait of the President) అను శీర్షికను ఒక ప్రత్యేక కార్యక్రమము ఆంగ్లములో ఆకాశవాణి ఢిల్లీ కేంద్రమునుండి ప్రసారము చేయబడును,

ఎస్.ఎం వాసి రచించిన ఈ రూపకాన్ని రమేశ్‌చంద్ర సహకారంతో ప్రాణ్ చోప్రా నిర్వహిస్తారు.

ఈ కార్యక్రమము ఆకాశవాణి వివిధ కేంద్రాలనుండి మె 9వ తేదీ బుధవారం రాత్రి 9-45 గంటలకు వినండి.



డా॥ బి. గోపాలరెడ్డి-ప్రసంగం
'రవీంద్రుని సంస్కృతి'' (హైదరాబాద్, మే 7)





దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రి-ప్రసంగం
"మా వూళ్ళో: వీధి అరుగు'' (హైదరాబాద్, మే 3)



పి. వి. రాజమన్నార్-ఆంగ్ల ప్రసంగం
'త్యాగరాజు' (విజయవాడ, మే, 7)





డా॥ జి.డి. బోయస్ ప్రసంగం
ఆంగ్లం (మద్రాస్, మే 11)



మలా కృష్ణమూర్తి (మద్రాస్, మే 6)



సంధ్యావందనం శ్రీనివాసరావు (మద్రాస్, మే 13)



మిటదొడ్డి సత్యవతి (విజయవాడ, మే 12)

(౧-వ పుట తరువాయి)

పరిపాలనా వ్యవస్థ ఎంతో నైపుణ్యముతో నడుస్తుంది. అన్నీ పెద్దయెత్తున జరుగుతాయి కనుక వ్యక్తి చేసేపని అంత కష్టముగా కనబడదు. భారీ పరిశ్రమల కాలవాలమైన సామ్రాజ్య వ్యవస్థలో చాలమంది కూలి నాలి చేసుకొని జీవించే వారుంటారు. కనుక, సాధారణముగా ఉత్పన్నమయ్యే సమస్యల్లో వారంత శ్రద్ధ చూపించరు. వారి సంబంధమల్లా జీతబత్తాలకు, జీవితావసరాలకు పరిమితమై వుంటుంది. తత్సంబంధమైన సమస్య ఉత్పన్నమైనపుడు అసంతృప్తి తీవ్రరూపము దాలుస్తుంది. ఈ అసంతృప్తి నిజస్వరూపాన్ని వదలి, ఎన్నో వికారరూపాలు దాలుస్తుంది. దానితో పెనుగాలి వీస్తుంది. పైనించి వచ్చే నిర్దేశానికి ఆత్మప్రబోధానికి మధ్య సంఘర్షణ బయలుదేరుతుంది. ఇలా కొన్ని దేశాలలో జరిగింది. అట్టి సంఘటనలు మనకు దిక్సూచిలా ఉపయోగపడాలి. మనకు కనువిప్పులా ఉండాలి. ప్రకాశికాయుతమైన ఆర్థిక, సాంఘిక విధానమే అట్టి ముప్పులనుండి తప్పించి మనలను రక్షించగల మార్గము. అయితే మన సమాజ స్వరూపమే ప్రజా పరిపాలనా విధానాన్ని నిర్ణయిస్తుంది.

ఓటుపద్ధతి–ప్రమోషనము

ఆయా స్థాయిలలో పరిపాలనా నిర్వహణ మూడు భాగాలుగా ఖండవచ్చు. ప్రథమంలో అన్ని శాఖలను శక్తివంతముచేసి సమన్వయపరచాలి. వాని అంతరంగిక కార్యకలాపాల్లో మాత్రం జోక్యం పెట్టుకోకూడదు. రెండవ ధర్మమేమంటే, కొన్ని కార్యక్రమాలను ప్రారంభించి అవి సక్రమంగా నిర్వహింపబడుట వానిపై అజమాయిషీ జరిపించాలి. మూడవ ధర్మంగా, పై అధికారవర్గం కాసి చిన విధులను, వారికి లోబడియుండే ప్రతినిధులు నిర్వర్తించాలి. దీనివల్ల క్రింది అంతస్థులలో ఉన్న వారందరు పై స్థాయిలోని అధికారులకు ప్రతినిధులుగా ఉంటారు. కేంద్ర, రాష్ట్ర స్థాయిలలోని విధానకర్తలు క్రింది స్థాయిలలోని వారితో పూర్తిగా కలిసిపోకూడదు.

ఆర్థిక వ్యవహారం ముఖ్యమైనది. దైనందిన కార్యకలాపాలను సక్రమముగా నడిపించేందుకు కొంత కనిష్ఠ ఆర్థిక స్వాతంత్ర్యము చట్టబద్ధంగా వుండాలి. అది ఎక్కువతక్కువలు లేక నిక్కచ్చిగా ఉండాలి. ఈ కనిష్ఠ ఆర్థిక కట్టుబాట్లు కాకుండా ఆయా ప్రాంతాలలో ఆర్థిక, సాంఘిక అసమానతలను రూపుమాపేందుకు గాను ప్రత్యక్ష ఆర్థిక సహాయము చెయ్యాలి. ఏజంటులు వారి కావలసిన ధనాన్ని సేకరించుకోగలగాలి. ఇవిగాకుండా ఆయా ప్రాంతాలలో స్థానిక పన్నులద్వారా ఆదాయాన్ని సేకరించుకోవాలి.

అట్టే వ్యత్యాసముండకూడదు

నైపుణ్యముతోటి పనిచేసేను, నీతి నిజాయితీ అంతా తమ ముక్తమైనదని తలచే ప్రభుత్వోద్యోగులు, దేశభక్తి, ప్రజాదరణ అనునవి యావత్తూ తమకు దత్తమైన సొత్తులా భావిచే ప్రజాప్రముఖులు వీరిరువురి మధ్య ఇట్టి మాసిపోని, మారిపోని అపోహలకు కారణము పరస్పర వైషమ్యాలే. ఈ రెండు వర్గాలయొక్క అధికార ప్రతిభలు తమతమ స్థాయిలలో అవసరములేని శ్రద్ధను గురి అయినాయి, వ్యవహార రంగములు భిన్నమైన ఈ వర్గాలమధ్య సంఘర్షణకు తావులేదు. ప్రజాస్వామ్యాల్లో ఎన్నికలద్వారా ప్రజా నాయకులు మారుతుంటారు. అట్టిపరిపాలనా భారాన్ని మోసే సివిల్ ఉద్యోగి బృందము నిజాయితీగా, అవిచ్ఛిన్నముగా సాగిపోవడమనేది ఒక ముఖ్యమైన విషయము. పరిపాలకోద్యోగుల నిరంకుశాధికారాలకు ప్రత్యామ్నాయంగా ప్రజా నాయకులకు, ఆ పనూ ముఖ్యంగా అధ్యక్షపీఠాన్ని అలంకరించేవారికి మితిలేని అధికారాన్ని దత్తం చెయ్యడము పెద్ద పొరపాటు. ఒకే రాజకీయ పక్షముండి దాని దారిన అది తప్పించుకోలేని స్థితిలోనే ఇట్టి రాజకీయ గజాయిద్ధ విస్తాయి. అట్టితటి ప్రజాసేవా సౌకర్యాల ఆవశ్యకత ఉండక పోవచ్చును. సభానాయకుని స్థితిగతులలోనే పరిషదధ్యక్షపదవిని అలంకరించ వ్యక్తికూడా ఉండును. వేలాది ప్రజలు చేసి అనేక నియోజకవర్గాలను ఎన్నిక అవుతారు ప్రజాప్రతినిధులు అట్టి ప్రతినిధులచే ఎన్నుకోబడుతాడు పక్షనాయకుడు. అధిక సభ్యులచే ఎన్నుకోబడిన పక్షనాయకుడే ముఖ్యమంత్రి పదవి నలంకరించి, కార్యనిర్వాహకవర్గమునకు పెద్దౌతాడు. అనుకరణకు ఇది సరియైన ఉదాహరణ. పరిపాలనా యంత్రాంగాన్ని అదుపు ఆజ్ఞలతో ఉంచుకొని దానిపై పర్యవేక్షణ అజమాయిషీ జరిపించవలసిన పరిషదధ్యక్షులకు వేతనాలు యివ్వడము, వాహనాలు సమకూర్చడమనేది అసంగతమైనది. జిల్లా పరిషత్తు అధ్యక్షులకు, సభ్యులకు ఉన్న అధికారాల్లో అట్టే వ్యత్యాసముండరాదు. అట్టిచో, అధ్యక్షుని ఎన్నిక సంవత్సరానికొకసారో లేక వీలునుబట్టో జరిగితే ఆ పరిషత్తు




సెక్కాళి సదాశివపిళ్ళై (మద్రాస్ మే, 7)

(52 తరువాయి పేజీనుండి)

యొక్క వ్యవహారకాండ అంతా మరింతగ ప్రజాస్వామిక తత్త్వాన్ని సంతరించుకుంటుంది:

## ప్రజాస్వామ్య సుస్వరూపము

ఈ కొత్త వికేంద్రీకృత ప్రజాస్వామ్యాలెట్లా తమ రూపురేఖలను దిద్దుకుంటాయో ఇప్పుడే చెప్పడము కష్టము. రాజస్థాన్, ఆంధ్ర ప్రదేశ్ లాంటి రాష్ట్రాలలో ఇవి ప్రజాదరణను, ప్రజోత్సాహాన్ని పొందగలిగాయనే నిశ్చయముగా చెప్పవచ్చును. తమ సంఘాన్ని బాగుపరచి పటిష్ఠము చేసుకుందామనే మహత్వాకాంక్ష ప్రజలలోంచి పుట్టుకురావాలి. నాయకులు వారిని సరియైన రీతిని కార్యోన్ముఖులను చెయ్యాలి. లోకసేవాగణములు వారి కార్యక్రమాన్ని నిర్వహించాలి ఇదే ప్రజాస్వామ్య సుస్వరూపము జాతి సమైక్యతకు ఇదే శ్రీరామరక్ష. ప్రథమంగా వెలువడిన నివేదికలవల్ల ఈ వికేంద్రీకృత ప్రజాస్వామ్యము పరిపాలనా విధానము దృష్ట్యా బాగా విజయవంతమగుచున్నదని తెలియుచున్నది. పరిషదధ్యక్షులు, బ్లాకు డెవలప్‌మెంటు అధికారులు, కలసిమెలసి పనిచేస్తే ఈ పరిషత్తులు చక్కగా వృద్ధిపొందుతాయని తేలుతోంది. ఇందులో ఆశ్చర్యపడవలసినదేమీ లేదు, సాంఘిక కార్యనిర్వహణ రీతీరులలో గ్రామీణులను నిరంతరం తర్ఫీదు చేయటము ఇందుకు అవసరము. వికేంద్రీకృత ప్రజాస్వామ్యమనేదాన్ని సంపూర్ణముగా సాధించుకునేతవరకు దానినే దృష్టిలో ఉంచుకొని అట్టి వ్యవస్థను సక్రమముగా దర్శింపకలుగుతూ ఉండటం అవసరము. ఇది ఒక సుదీర్ఘమైన ప్రయాణము—ఇదే మనకు ధ్యేయమైనది.

[రెండవ పుట తరువాయి]

మన సంస్కృతిలో నొక్కి చెప్పవలసిన మరొక విషయం ఉంది. మాప్రవక్తే అనిదం పూర్వుడనీ, ఆయన బోధలు మాత్రమే పరమసత్యాలనీ, అవి ఇతర మతాల్లో మచ్చుకైనా కానరావని మనం అదేపనిగా చెప్పుకోలేదు. అలాటి భావం అసత్యమనీ సరియైనది కాదనీ, మొదటి నుంచీ మన తలంపు. జ్ఞానమంతా భగవద్దత్తమే. కాని దానిని గ్రహించడానికి మనిషికి వుండే తెలివితేటలనుబట్టి దానిపరిమాణం వుంటుంది. అందుచేత జ్ఞానం అపరిష్కృతంగా, అవ్యక్తంగా వుంటే వుండవచ్చునుగాని. అది పాక్షికంగా గాని అసత్యంగా గాని వుండనేరదు. మొగ్గ పరిపూర్ణమైన పుష్పంగా విచ్చుకోవడం లాంటిది జ్ఞానం. ఏ దశలోనూ అది పాక్షికమైనదీ, అసమగ్రమైనదీకాదు. జీవిత సత్యాన్ని చరమ ప్రయోజనాన్ని, మననం చేసిన మన మహాపురుషులు, అందులో సంపూర్ణమైన ఏకత్వాన్ని దర్శించారు. కాబట్టే వాళ్ళు, ఏకమ్ సత్ విప్రా బహుధా 'వదంతి' అని చెప్పారు. ఈ జ్ఞాన వైవిధ్యం ఎవ్వరినీ తొందర పెట్టవసరం లేదన్నారు. అది, దేవుని అద్భుతశక్తి, మాయ. అది, మనల్ని గందరగోళంలోకి దించడానికి కాదు, మనలోని ఏకత్వ జ్ఞానం సుసంపన్నంకావడానికి దానివల్ల మనం సంఘర్షణను తగ్గించుకుని, సమన్వయ భావాన్ని, పరిపూర్ణ అంగీకారాన్ని పెంపొందించుకొనగలం. ప్రకృతి పరిశీలనాదక్షులైన ప్రాచీన కవులు వివిధమార్గాలనూ వివిధనదులుగా అభివర్ణించారు. ఆ నదులు వివిధ ప్రదేశాలగుండా ప్రవహిస్తూ ప్రాణికోట్లకు నీటినీ, సారవంతమైన ఒండ్రుమట్టినీ, పుష్కలంగా అందజేస్తాయి. రకరకాల సరుకుల పడవలను తీసుకుపోతాయి, చివరకన్నీ సముద్రంలో లీనమౌతాయి. అలాగే ఈ విభిన్న మార్గాలన్నీ పోయిపోయి చివరకు మానవ జీవితమనే మహా సాగరంలో కలిసిపోతాయి. భారత దేశం ఒక సమగ్రమైన సంస్కృతిని రూపు దిద్దుకునేటట్లు చేసింది ఈ సమన్వయ జ్ఞానమే. రవికవి దీనిని చెప్ప సంకల్పించాడు కాబట్టే, ఆయన వాక్కులు, అంత స్ఫూర్తిగలవి, అన్నిదేశాల వారికీ, వివిధ సంస్కృతులవారికీ, అంత సమ్మతమైనవీ అయినవి.



కలలవంట చిత్రకారుడు—ఎమ్. శంకరరావు

## సమైక్యం, సామరస్యం, సమాధానం

సత్యాన్వేషణ అద్భుతమైంది. ప్రకృతిని పరిశీలించడంలోనూ, తద్ధ్యానంతోనూ, విజ్ఞానశాస్త్రజ్ఞులు తృప్తిచెందరు. నీ రహస్యాలు బయటపెట్టమని, దాన్ని చీల్చి చెండాడుతారు, అందువల్ల సత్యం యొక్క కొన్ని పోకడలు వారు కనిపెట్టలేకపోలేదు. కాని ఈ సాధింపు పద్ధతిలో వారికి ఇంకా ముందుకు పోవడం కష్టమైంది. సాధనలను పరిశుభ్రం చేసుకుని, కఠిన నియమంచేత బుద్ధికి పదను పెట్టగలిగిన మీదటనే, వారు, సరియైన ఊహద్వారా, జ్ఞానాభివృద్ధిపొంది, ప్రకృతియొక్క ఉత్తమ ధర్మాలను కనిపెట్టనారంభించారు. వారి మొదటి మొదటి ప్రయోగాలు మోటైనవి. తన బిడ్డ మనస్సు తెలుసుకోడానికి తల్లి ఏం చేస్తుంది? ఆవిడ బిడ్డను భయపెట్టదు, బాధించదు, పోలీసు వాళ్ళ మాదిరిగా ప్రశ్నలూ, అడ్డ సవాళ్ళూ వెయ్యదు. ఆవిడ బిడ్డ పట్ల ప్రేమ చూపుతుంది. ఆ ప్రేమ చూపడం ఒక్క తల్లికే తెలుసు. బిడ్డను బుజ్జగించి లాలిస్తుంది. అప్పుడు బిడ్డ తన మనస్సులో వున్నదంతా వెళ్ళగ్రక్కకుండా వుండలేదు. ఆ మోటు విజ్ఞాన శాస్త్రవేత్త పద్ధతి 'ప్రయోగ ప్రక్రియ' ఈ ప్రేమమయియైన తల్లి పద్ధతి, "యోగ ప్రక్రియ" యోగమంటే సమైక్యం, సామరస్యం, సమాధానం.

## సత్యసాక్షాత్కారం

సానుభూతితో, హృదయ స్పందనంతో కూడుకున్న ఈ 'యోగం' నిజమైన కవికి స్వాభావికమైంది. ఆతడు జీవత్పరిశీలనతో, నిరంతర ధ్యానంతో, తన హృదయాన్ని సున్నితం చేసుకుంటాడు. అప్పుడాతనికి సత్యాన్వేషణకై బయలుదేరవలసిన పనిలేదు. సత్యమే అతనికి సాక్షాత్కరిస్తుంది. అందుకే ఉపనిషత్కవి 'హృదయం నహి సత్యమ్ జానాతి' అని ఉత్తమమైన వేదాంత సత్యాన్ని వెల్లడించాడు.

మానవుల హృదయాలమీదా, జీవితాలమీదా మతాలపట్టును వివ

రిస్తూ, ఇంకొక ఉపనిషదృషి, 'ధర్మశాస్త్రమ్ మహర్షీణామ్ అంతఃకరణ సంభృతమ్' అని చెప్పాడు.

## ప్రాతినిధ్యం

మానవుల వైయక్తిక, సామూహిక, జీవితాలను, సమన్వయ పద్ధతిలో నియమితంచేసే వివిధ ప్రయత్నాలే, వివిధ మతాలు. మతాలనే ఈ వివిధ సమన్వయాలనూ, ఒక మహాసమన్వయంగా రూపొందించే భాగ్యం భారత ఋషులకూ, కవులకూ, దక్కింది. తన అద్భుతాంతఃకరణ జ్ఞానంతో టాగూరు, ఈ మహా సమన్వయాన్ని దర్శించి దానిని అనేక విధాలుగా గానం చేశాడు. ఇది ఈనాడు ప్రపంచాన్ని ప్రభావితం చేసిన టాగూరుయొక్క ఇంకొక మహాగుణం.

ప్రకృతి పరిశీలన మాట అలా వుంచి, టాగూరుకు సరియైన జ్ఞానం కలుగజేసింది. నవీనకాలపు మహర్షియైన ఆయన తండ్రితో సన్నిహిత సంబంధం. మహర్షి ధ్యానంవల్ల పొందిన జ్ఞానాన్ని, రవీంద్రనాథ్ అర్థంచేసుకుని, అర్థం చెప్పి, సుబోధకం చేశాడు. కాబట్టి పరమోత్కృష్టమైన భారత సంస్కృతియొక్క ఆత్మకు రవీంద్రనాథుడు ప్రాతినిధ్యం వహిస్తాడు. అదీ ఆయన భారతవర్ష సాహిత్యానికీ, ఆలోచనకూ, అర్థజ్ఞానానికీ శాశ్వతంగా ప్రసాదించిన ఆస్తి.

## కల్మషం కడిగేసుకొని మరీరా!

మనదేశం, అధ్యాత్మిక సంపదకూ, అపరిమితౌదార్యానికీ, నిలయమనే సంగతి తెలపడానికే దానికి 'భారతవర్షం' అని పేరు పెట్టడం 'భరణాత్ భరతః, భరణాత్ భారతః' అని కదా సూక్తి!

చిరకాలం విదేశీయుల ఆక్రమణల తొందరలతో కూడిన భారతదేశ చరిత్ర చదవని వాళ్ళెవరు? మనకంటే, విదేశీయులకే మన చరిత్ర ఎక్కువగా తెలుసునేమో ? వారికి సునిశితమైన చరిత్ర వాసనవుందిగా మరి, కాని మన దేశచరిత్ర యొక్క పరమప్రయోజనాన్ని గురించి గానంచేసిన ఖ్యాతి టాగూరుదే. మానవానీకానికి భారతదేశం ఒక సందేశం ఇవ్వవలసి వున్నదని టాగూరు గుర్తించాడు. సర్వ సంస్కృతుల సమన్వయమే ఆ సందేశం. మన దేశాన్ని లోగొనడానికీ కొల్లగొట్టడానికీ, వివిధ జాతులవారు ఇక్కడికి ఎలా వచ్చిందీ. వచ్చినవాళ్లు ఇక్కడే స్థిరపడిపోయి సర్వమానవ సంస్కృతీ నిర్మాణానికి వాళ్లు తమ తమ వంతు ఎలా అర్పించుకున్నదీ, ఆయన గానం చేశాడు. అన్నిటినీ చేపట్టి, దేనినీత్యజించని ఈ సమైక్య సంస్కృతిలోకి, ఆయన, పూర్వులనూ, అందరినీ బేషరతుగా ఆహ్వానించాడు. కాని ఈ మహా సమన్వయానికి మూలకారకుడైన వాడి విషయంలో మాత్రం, ఒక చుఱకలాంటి షరత్తు పెట్టాడు. 'ఏషో, యే బ్రాహ్మణ శుచికరిమన' అనాడు. అంటే 'మహామేధావినని మిడిసిపడే బ్రాహ్మణుడా! నీమనస్సులోని కల్మషమంతాకడిగివేసుకుని మరీరా' అని అర్థం, ఏమిటా కల్మషం?

శుచిత్వ సాధనలోపడి, బ్రాహ్మణుడు తిరస్కారభావాన్నీ, భేదదృష్టినీ, పెంపొందింప జేసుకున్నాడు. మహాసమన్వయ పద్ధతిని ఇలా వితథం చేసినందుకు ప్రతిఫలంగా, అతడు ఏళ్ళతరబడి అవమానానికీ, అపార్థానికీ, పతనానికీ పాల్పడ్డాడు.

ఈ కాలపు బ్రాహ్మణుడనని, ఐరోపా, అమెరికాల తెల్లమనిషి గర్విస్తున్నాడు. టాగూరు పెట్టిన పై చురక, అతనికికూడా అన్వయిస్తుంది. అతడు సర్వమానవ సభ్యతలో భాగస్వామికావాలంటే ముందు, తన వర్ణగర్వాన్నీ, సామాజికాధిక్యతనూ, అధికార దర్పాన్నీ వదులుకోవాలి. ఈ సందేశాన్ని టాగూరు తన పసితనంనుంచీ, జీవితాంతం, వినిపిస్తూనే వచ్చాడు. భారతవర్షంయొక్క, ఈ ప్రధాన సందేశాన్ని రాజకీయ విప్లవాలద్వారా, సామాజిక పునర్నిర్మాణంద్వారా, సంస్కృతీ సమన్వయంద్వారా, గాంధీ నెహ్రూలాంటి మహనీయులు సాధించడం చూచే మహాభాగ్యం టాగూరుకు దక్కింది.

తెలుగు: నాయని సుబ్బారావు



ప్రపంచ నాటకరంగాన్నిగురించి డి.జె. అల్గర్‌తో ఎ.ఎస్. థియోడోర్ పరిచయము (మద్రాస్‌నుండి ప్రసారితము)



1962 అంతర్విశ్వవిద్యాలయ రేడియో చర్చల పోటీలో గెలుపొందిన మద్రాస్ విశ్వవిద్యాలయ విద్యార్థుల బృందము




## అఖిల భారత కదంబ కార్యక్రమము

మె 1-వ తేదీ మంగళవారం నుండి మె 15-వ తేదీ మంగళవారం వరకు

(మే 6, 13 ఆదివారములు మినహా)

**ఉ॥ ప్రసారము I**

42.13 మీ (7120 కిలోసై)
41.32 మీ (7260 కిలోసై)

7-00 అరుణోదయ సంగీతమంజరి
7-30 వందన్‌వార్ భక్తి గీతావళి
8-00 ఝుంకార్ వాద్య సంగీతం
8-15 స్వర్‌సంగమ్ కదంబ కార్యక్రమం
8-30 మధువన్
8-57 ఝరోఖా నేటి కార్యక్రమముల వివరణ
9-00 ప్రసార సమాప్తి

**మ॥ ప్రసారము II**

31.28 మీ (9590 కిలోసై)
31.41 మీ (9550 కిలోసై)

11-00 ఇంద్రధనుస్సు కదంబ కార్యక్రమము
12-00 ప్రసార సమాప్తి

**మ॥ ప్రసారము III**

81.41 మీ (9550 కిలోసై)
31.28 మీ (9590 కిలోసై)

2-00 మనోరంజన్ మీరుకోరిన పాటలు
3-00 ప్రసార సమాప్తి

**సా॥ ప్రసారము IV**

31.41 మీ (9550 కిలోసై)

**కర్ణాటక సంగీత కార్యక్రమము**

4-30 గీతమాలిక
4-45 అంజలి-గీతావళి
5-00 వాద్య సంగీత్
5-15 మధురగీతం మీరుకోరిన పాటలు (బుధ, శుక్ర, ఆదివారములు)
6-00 గానామృత్ శాస్త్రీయ సంగీతం
6-15 ప్రసార సమాప్తి

**సా॥ ప్రసారము V**

31.41 మీ (9550 కిలోసై)
41.32 మీ (7260 కిలోసై)

6-30 తార్‌హార్ ప్రసిద్ధ పురాతన గీతాలు
6-45 ఉదయగాన్ దేశభక్తి గీతాలు, బృందగానము
7-00 పుష్పావళీ మీరు మెచ్చిన పాటలు
7-30 గజరా గీతికా గుచ్ఛము
8-00 పత్రావళీ శ్రోతల ఉత్తరాలు
8-10 రస్‌వంతి సుగమ సంగీతం మీరుకోరినవి (బుధవారములు)
8-30 మన్ చాహే గీత్ మీరుకోరిన పాటలు
9-00 హవామహల్ నాటికలు, రూపకములు, హాస్య రచనలు
9-15 మంజూషా జానపద, ప్రాంతీయ సంగీతం
9-30 రాగ్‌రంగ్
9-42 ఝరోఖా రేపటి కార్యక్రమముల వివరణ (శనివారములు మినహా)
9-45 ప్రసార సమాప్తి

**ప్రత్యేక కార్యక్రమము**

మె 5, 12 శనివారాలు

రా॥ 9-45 నుండి 11-00 వరకు
50.38 మీ (5955 కిలోసై)
10-00 నుండి 11-00 వరకు
41.32 మీ (7260 కిలోసై)

9-45 నాదరంజని వాద్య సంగీతం
10-00 గీతమంజరి లలిత సంగీతం
10-40 రంగవాణి లలిత శాస్త్రీయ సంగీతం
10-57 ఝరోఖా వచ్చేవారపు కార్యక్రమాల వివరాలు
11-00 ప్రసార సమాప్తి

మె 6, 13 ఆదివారాలు ముఖ్యమైన పండుగ దినాలు

**ఉ॥ ప్రసారము I**

41.13 మీ (7120 కిలోసై)
41.32 మీ (7260 కిలోసై)

7-00 అరుణోదయ సంగీతమంజరి
7-30 వందన్‌వార్ భక్తి గీతాలు
8-00 ఝుంకార్ వాద్య సంగీతం
8-15 స్వర్‌సంగమ్ కదంబ కార్యక్రమము
8-30 గీతోంభరీ కహానీ పాటలతో కూర్చిన కథ
8-57 ఝరోఖా నేటి కార్యక్రమముల వివరణ
9-00 ప్రసార సమాప్తి

**ప్రసారము II**

31.28 మీ (9590 కిలోసై)
31.41 మీ (9550 కిలోసై)

10-15 రంగావళీ
10-45 రత్నాకర్ నాటికలు, హాస్యరచనలు, కథలు
11-00 బాగ్‌బహార్
11-30 చౌవరా మాటలు, పాటలు
12-00 ప్రసార సమాప్తి

**మ॥ ప్రసారము III**

31.41 మీ (9550 కిలోసై)
31.28 మీ (9590 కిలోసై)

2-00 మనోరంజన్ మీరుకోరిన పాటలు
3-00 అప్నాఘర్ మీ ఇంట్లో అందరికీ
3-30 ప్రసార సమాప్తి

**సా॥ ప్రసారము IV**

31.41 మీ (9550 కిలోసై)

**కర్ణాటక సంగీత కార్యక్రమము**

4-30 గీత మాలిక
4-45 అంజలి-గీతావళి
5-00 వాద్య సంగీత్
5-15 మధుర గీతం మీరుకోరిన పాటలు (బుధ, శుక్ర, ఆదివారములు)
6-00 గానామృత్ శాస్త్రీయ సంగీతం
6-15 ప్రసార సమాప్తి

**సా॥ ప్రసారము V**

31.41 మీ (9550 కిలోసై)
41.32 మీ (7260 కిలోసై)

6-30 తార్‌హార్ ప్రసిద్ధ పురాతన పాటలు
6-45 ఉదయ్‌గాన్ దేశభక్తి గీతాలు, బృందగానము
7-00 పుష్పావళీ మీరు మెచ్చిన పాటలు
7-30 గజరా గీతికా గుచ్ఛము
8-00 పత్రావళీ శ్రోతల ఉత్తరాలు
8-10 రస్‌వంతి సుగమ్ సంగీత్
8-30 మన్-చాహే గీత్ మీరుకోరిన పాటలు
9-00 హవామహల్ నాటికలు, రూపకములు, హాస్య రచనలు
9-15 మంజూషా జానపద, ప్రాంతీయ సంగీతం
9-30 రాగ్‌రంగ్
9-42 ఝరోఖా రేపటి కార్యక్రమముల వివరణ
9-45 ప్రసార సమాప్తి

ఇతర వివరములకు: ప్రొడ్యూసర్, 'వివిధభారతి' ఆకాశవాణి, పోస్ట్‌బాక్స్ 4, బొంబాయి-1.

VANI-Printed at the Royal Printing Works, Madras-2-Edited and Published by the Station Director, All India Radio, Madras-4.




లలితా శివజ్యోతి వారి......

# లవకుశ

(పూర్తి గేవాకలర్ చిత్రం.)

డైరెక్షన్: సి. పుల్లయ్య, సి. యస్. రావు

Regd. No. M 5404



డా॥ ఏ. లక్ష్మణస్వామి ముదలియార్ : ఆంగ్ల ప్రసంగం
ప్రపంచ ఆరోగ్య దినోత్సవ సందర్భంలో ఇటీవల మద్రాస్
కేంద్రంనుండి ప్రసారితము



ద్వారం వెంకటస్వామి నాయుడు, మంగతాయారు : వయొలిన్
(మద్రాస్, మే 11)



మద్రాస్ నగరం సందర్శించిన ఆఫ్ఘన్ రేడియో కళాకారుల బృంద
నాయకులు, ఆఫ్ఘన్ రేడియో నిలయ అధ్యక్షులు మద్రాస్ కేంద్రంలో
వాద్యబృంద సంగీతము విను దృశ్యము



బృంద నాయకులు మద్రాస్ కేంద్ర డైరెక్టర్ శ్రీ వి. కృష్ణమూర్తితో
స్టూడియోలను సందర్శించుట



దేవకోట్టై ఏ. నారాయణ అయ్యంగార్ : వీణ
(మద్రాస్, మే 14)



'ఏకాదశి' ప్రత్యేక కథానికా కార్యక్రమంలో పాల్గొన్న రచయితలు
(హైదరాబాద్)